*S. V. University Oriental Series–No. 14*

సాధారణ సంపాదకుడు :

డైరెక్టర్. యస్. వి. యు. ఓ. ఆర్. ఇన్‌స్టిట్యూట్

# బలభద్రదాసి విరచిత

# కపోత వాక్యము

## (యక్షగానము)

పరిష్కరణ - పీఠికారచన

కొల్లాగుంట ఆనందన్, ఎమ్.ఏ., ఎమ్.ఫిల్.,

సహాయాంధ్ర పరిశోధకుడు

యస్. వి. యు. ఓ. ఆర్. ఇన్‌స్టిట్యూట్.



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

ప్రాచ్య పరిశోధనా సంస్థ

తి రు ప తి

1986

Rs 31-00

ప్రథమ ముద్రణం 1986

ప్రతులు-500



*This book is printed with the Grant-in-Aid under Central Government Scheme of Financial Assistance to Voluntary Organisations, Educational Institutions, Libraries, etc., for Preservation, Listing, Cataloguing, Evaluation, publication of Manuscripts.*

ముద్రణము :

భాగ్యం క్వాలిటీ ప్రింటర్స్

48-బి రామానుజ అయ్యరువీధి,

మదరాసు - 600021.

డా॥ డి. శ్రీధరబాబు

డైరెక్టర్ ఇన్‌చార్జి.
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనా సంస్థ
తిరుపతి.

# ముందు మాటలు

అముద్రిత వ్రాత ప్రతులనుండి ఎన్నికచేసి ప్రచురించే తెలుగు గ్రంథ పరంపరలో ఈ కపోతవాక్యం ఒకటి. ఇది మా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాసంస్థ వ్రాత ప్రతుల సంచయంలో నుండి ఎన్నుకో బడింది. పాఠ నిర్ణయార్థం మావద్ద వున్న ప్రతులతో సరిపోల్చడానికి తంజావూరు సరస్వతీ మహలులోని వ్రాతప్రతులు తోడ్పడ్డాయి. భారత ప్రభుత్వపు విద్యా మంత్రిత్వశాఖ అందించిన ఆర్థిక సహాయంతో ఈ చిన్న గ్రంథం ముద్రించబడింది. ఈ గ్రంథాన్ని పరిష్కరించి విమర్శనాత్మకమైన పీఠిక రచించి వెలువరించిన పరిశోధకుడు శ్రీ కె. ఆనందన్. ఇతడు మా ప్రాచ్య పరిశోధనా సంస్థలో సహాయాంధ్ర పరిశోధకుడుగా పనిచేస్తూ ఉన్నాడు. తాను రచించిన దీర్ఘమైన పీఠికలో అనేక పరిశోధనాంశాల్ని తెలిపాడు. వివిధ ఛందో విలక్షణమైన, విషయ సమృద్ధమైన ఈ చిన్న గ్రంథానికి ఇంత పెద్ద పీఠిక అవసరమే.

మా ప్రాచ్య పరిశోధనాసంస్థ దేవస్థానం పరిపాలననుండి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పరిపాలనా పరిధికి తరలింపబడి నప్పటి నుండి ప్రచురింపబడిన అముద్రిత తెలుగు గ్రంథాల సంఖ్య కొద్ది మాత్రమే. అందులో ముఖ్యంగా పేర్కొనదగినవి, ప్రద్యుమ్నచరిత్ర, తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల భగద్గీతా వచనవాఖ్య, జల క్రీడావిలాసం. ఇందులో రెండు కావ్యాలు ఒకటి 16 వ శతాబ్దపు వచన రచనకు ఉదాహరణ.

ప్రస్తుత కపోతవాక్య కావ్యం దేశీ సాహితీ యక్షగాన రచన. బలభద్రదాసి అన్న కవయిత్రి దీని రచయిత్రి. యక్షగాన ప్రక్రియ అనేక కళాంశాలను ముఖ్యంగా సంగీత సాహిత్య నాట్యాన్ని తనలో ఇముడ్చుకొన్న ఒక విలక్షణమైన సాహితీరూపం. పశుపక్ష్యాదుల్ని పాత్రలుగా రూపొందించి వాటిచేత మాటలాడించి, నీతి నియమాల్ని, ధర్మాధర్మాల్ని అభివ్యక్తంచేసే పద్దతి భారతీయ సాహిత్యరంగంలో చాల ప్రాచీనమైంది. ఈ పద్ధతిని అనుసరించి భారత రామాయణాల కథా నేపథ్యలో కపోతవాక్య యక్షగానం ఒక కవయిత్రి సాహితీ సృజనలోనుండి అద్వితీయంగా వెలువడింది.

మా ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఇంకా ఎన్నో విలువైన అముద్రిత యక్షగానాలు ఉన్నాయి. అచిర భవిషభ్యత్తులోనే అవీ వెలుగు చూస్తాయని ఆశిద్దాం.

శ్రీ ఆనందన్ ముమ్ముందు అనేక అముద్రిత గ్రంథాలను పరిష్కరించి, ప్రచురించడమే కగా పరిశోధనా రంగంలో మరింతగా కృషిచేసి అనేక రచనలను వెలుగులోకి తీసుకొని వస్తాడని మా ఆకాంక్ష.

తిరుపతి
21-7-1986

డి శ్రీధరబాబు

# కృతజ్ఞతలు

ఈ 'కపోతవాక్యమును' గవర్నమెంటు ఆఫ్ ఇండియా పబ్లికేషన్ ఆఫ్ మాన్యుస్క్రిప్ట్సు ప్రణాళికక్రింద పరిష్కరణకు తీసికొనడానికి అప్పట్లో అనుమతించిన మాప్రాచ్య పరిశోధనసంస్థ ఇన్‌ఛార్జి డైరెక్టర్ డా. డి. శ్రీధర్ బాబుగారికి, ఆతర్వాత పరిష్కరణార్థం ప్రోత్సహించిన సహృదయులు మా డైరెక్టరు ఆచార్య యస్. శంకరనారాయణన్ గారికి నా కృతజ్ఞతాభి వందనాలు. ఈ కావ్యం ఇలా వెలుగుచూడడానికి ముఖ్య కారకులు డా. కె. జె. కృష్ణమూర్తిగారు. వారు నాకు పరిష్కరణలోని మెలకువలను నేర్పిన గురువులు అంతేగాక ప్రతిపుటను చూచి తగిన సలహాలిచ్చినవారు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు. ఈ పరిష్కరణలో తగిన సలహాలను ఇచ్చిన మిత్రులు శ్రీ యమ్. ప్రభాకరరావు, డా ఇ. చంద్రమౌళిఅన్న గార్లకు, మరియు సహృదయులు డా. యస్. యస్. రామచంద్రమూర్తి గారికి, ఈ గ్రంథ ప్రచురణకు అనుమతి నిచ్చి నన్ను తంజావూరు సరస్వతీ మహలులోని వ్రాతప్రతులను సంప్రదించడానికి పంపిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులకు, తంజావూరు సరస్వతీమహలులో ఉన్న వ్రాత ప్రతులను సంప్రదించడానికి అనుమతి నిచ్చిన ఆ గ్రంథాలయాధికారులకు, తంజావూరులోని ప్రతులను సంప్రదించడంలో సహాయపడిన మిత్రులు శ్రీ వి. వేంకటరమణారెడ్డి గారికి, ఈ కావ్యాన్ని ఇంత అందంగా ముద్రించి ఇచ్చిన భాగ్యం క్వాలిటీప్రింటర్స్ అధినేత శ్రీ బ్రహ్మంగారికి, వారి సిబ్బంది అందరికి నా ధన్యవాదాలు.

కె. ఆనందన్.

# పీ ఠి క

## I. యక్షగాన ప్రక్రియ :

యక్షగానం దేశి సాహితీ స్వరూపాన్ని సమగ్రంగా పుణికి పుచ్చుకొని మధుర కవితలలో అగ్రగణ్యమై అలరారుతోంది. ఈ యక్షగాన ప్రక్రియ కేవలం గానప్రధానంగా ఆవిర్భవించి, నృత్తనృత్యాత్మకమై, రూపకోప యుక్తమైన రచనగా పరిణమించింది. పండిత పామరవాఙ్మయ ప్రక్రియలకు, తత్త్వాలకు సామరస్యం సాధించింది. అన్నితరగతులకు చెందినకవులు, ప్రదర్శకులు యక్షగానాల్ని అభిమానించి రచించారు. తెలుగు జాతియొక్క చిరంతనమైన గాన కళాభిరుచికి నాట్యకళాభిమానానికి నిధానంగా నిల్చింది.

యక్షగానాల ఇతివృత్తాలలో పౌరాణికాలు, స్థలపురాణాలు, చారిత్రకాలు, సమకాలికేతి వృత్తాలు, సాంఘికాలు, మహాపురుషుల చరిత్రలు, జానపదగాథలు, కళ్యాణకథలు, తత్త్వవిషయకాలు—మొదలగు పలు తరగతులకు చెందిన వెన్నో ఉన్నాయి. ఇంతటి వస్తు వైవిధ్యాన్ని ప్రదర్శించిన యక్షగాన కవితాశాఖ ఇతర సాహిత్య ప్రక్రియలకు ఏమాత్రం తక్కువకాని ప్రాబల్యాన్ని పొంది ఉంది.

## II. సాహిత్యం – పశుపక్ష్యాదులకు సంబంధించిన కథలు:

కథా వాఙ్మయానికి పుట్టినిల్లు భారతదేశం. అట్టి భారతదేశంలో కథలద్వారా విద్యాబోధన చేసిన మొదటిగురువు విష్ణుశర్మ. ఈ కథా వాఙ్మయంద్వారా, ముఖ్యంగా పశుపక్ష్యాదులచే నీతిని బోధించడానికి గల ప్రధాన కారణాలు రెండని తోస్తుంది.

1. సూత్రరూపంలో వుండే ధర్మతత్త్వాన్ని, మనో ధర్మతత్త్వాన్ని బోధించే సందర్భంలో కొందరికి అర్థంకానిస్థితి ఏర్పతుంది. ఒకవేళ అర్థమైనా అది హృదయానికి హత్తుకోదు. అట్టి సందర్భంలో సూత్రప్రాయంగా చెప్పిన ధర్మాన్ని వివరించి చెప్పడానికి శ్రోతల హృదయాలలో దానిని హత్తుకొనిపోయేలా చేయడానికి ఉదాహరణప్రాయంగా కథ చెప్పడం అవసరం.

2. పశుపక్ష్యాదులకు లేని కొన్ని కట్టుబాట్లు, నీతి నియమాలు మానవుని కున్నాయి. కాని సంఘానికీ, సంఘం కట్టుబాట్లకు దూరంగా కొందరు మానవులు ప్రవర్తిస్తారు. అట్టి మానవులకు బుద్ధి గరపడానికి పశుపక్ష్యాదులే మంచిమార్గంలో ప్రవర్తిస్తూ ఉంటే మానవుడనైన తాను ఎందుకు సన్మార్గంలో ప్రవర్తించకూడదు? అని భావించడానికి వీలుంది. అందుకే నీతిని బోధించడానికి పశుపక్ష్యాదులను ఎన్నుకొన్నారు ప్రాచీనులు.

ఇలా పశుపక్ష్యాదులకు సంబంధించిన కథలు మన సాహిత్యంలో అనేక ప్రక్రియలలో వెలువడ్డాయి. పక్షులకథ ఆధారంగా బలభద్రదాసి కపోతవాక్యాన్ని యక్షగానంగా రచించింది అట్టి వానిలో పక్షులకథ ఆధారంగా కపోతవాక్యమనే ఈ యక్షగానం పేర్కొనదగివుంది.

## III. కవి :

'కపోతవాక్యము' అనే యక్షగానాన్ని 'బలభద్రదాసి' అన్న కవయిత్రి వ్రాసింది. ఈమె తండ్రి సోమయ. తల్లి మల్లాంబిక. బలభద్రదాసి అన్న పేరునుబట్టి దీనికర్త స్త్రీయా? లేక పురుషుడా? అన్న సందేహం కలగడానికి వీలుంది.

మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యపరిశోధనా సంస్థవారి **A descriptive catalogue of the Telugu Manuscripts** (1940) లో కపోత వాక్యాన్ని బలభద్రదాసి అన్న కవి రచించినట్లు పేర్కొనబడిఉంది.

డా॥ యస్. వి. జోగారావుగారు తమ 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' (1961) లో బలభద్రదాసి అన్న పేరునుబట్టి ఈమె స్త్రీయని తోచు చున్నది అన్నారు.

శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ 'అఖిలభారత కవయిత్రులు' (1965) అన్న పుస్తకంలో బలభద్రదాసిని కవయిత్రిగనే పేర్కొన్నారు.

తెలుగు అకాడమీవారి 'తెలుగు సాహిత్యకోశము' (1980) లో 'ఈమె సోమయసోముని భామయైన మల్లాంబిక పట్టి. పేరునుబట్టి స్త్రీ అనే అని పిస్తుంది. తల్లిపేరు మాత్రమే స్పష్టంగా చెప్పుకోవడం ఆమె సోమయసోముని భామ అని అనడమూ పేరులో 'దాసి' అని ఉండడంవల్ల రచయిత స్త్రీ అని,

దేవదాసి అయి ఉండవచ్చునని అనుకోవడానికి ఆధారాలు ఉన్నాయి - అని చెప్పబడిఉంది.

'దాసి' అన్నపదానికి 'ఆంధ్రశబ్దరత్నాకరము'లో వ్యుత్పత్తి చెప్పబడి ఉంది. దాసస్యస్త్రీ. దాస + జీష్ అనియు, దాసి అంటే స్త్రీ, పరిచారిక అనియు అర్థాలు ఇవ్వబడ్డాయి.

'దాసి' అన్నపదాన్ని కొందరుశైవులు, వైష్ణవులు పురుషులకు కూడ ప్రయోగిస్తారు. ఉదా : సడిసన్నదాసి (బసవపురాణము, ఆశ్వా 1. ద్విపద 6.) చెన్నారఁగాళిదాసియు శివునిచేత' అని పండితారాధ్య చరిత్ర మహిమాప్రకరణములో 273 పద్యంలో ఉంది.

వీరశైవ, వీరవైష్ణవాలలో పురుషులుకూడా తమకు స్త్రీత్వాన్ని ఆపాదించుకోవడం ఉంది. వైష్ణవ మధుర భక్తి సంప్రదాయంలో భక్తుడు తనను స్త్రీగా భావించుకొంటాడు. విష్ణువు ఒక్కడే పురుషోత్తముడు మిగిలిన వారందరూ ఆయన ప్రియురాండ్రే. అంటే పురుషులుకూడ తమకు స్త్రీత్వాన్ని ఆపాదించుకొంటారు. కపోత వాక్యములో ఎక్కడా వీరవైష్ణవ సంప్రదాయం గాని, వీరశైవ సంప్రదాయంగాని కనిపించదు. మధురభక్తి ఛాయలుకూడ లేవు. కాబట్టి శైవ, వైష్ణవ సంప్రదాయానుసారం పురుషునికి 'దాసి' అన్న ఇకారాంత స్త్రీలింగం చేరిందని భావించడానికి వీలులేదు.

'తెలుగు సాహిత్యకోశము' లో బలభద్రదాసినిగూర్చి చెబుతూ ఈ కవయిత్రి తండ్రిపేరు స్పష్టంగా లేదనియు, ఈమె దేవదాసి కావచ్చునని చెప్పబడిఉంది. కాని ఈ యక్షగానంలో తండ్రిపేరు స్పష్టంగా చెప్పబడి ఉంది.

'సుమతి సోమయ్యకు, శుభ గుణవతికి
భామ మల్లాంబకుఁ - బట్టి యైనట్టి
ధర వెలయు బలభద్ర - దాసి శ్రీహరికి'

అని ఉంది. అందువల్ల తండ్రి సోమయ్య. తల్లి మల్లాంబిక అని చెప్పవచ్చు. అదియునుగాక ఈమె దేవదాసి అనడానికి కూడ ఆధారాలు మృగ్యం.

దక్షిణాంధ్రయుగ సాహిత్యాన్ని పరిశీలిస్తే ఎందరో కవయిత్రులు ఆంధ్ర సాహితీలక్ష్మికి అలంకార ప్రాయమైన ఎన్నో రచనలు వెలువరించారు. వీరిలో గంగాదేవి, తాళ్ళపాక తిమ్మక్క, రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ, ముద్దుపళని లాంటివారు పేర్కొనదగినవారు. వీరి కాలంలోనే అనేక వస్తువైవిధ్యం కల్గిన యక్షగానాలు వెలువడ్డాయి.

ఆనాటి ప్రజల అభిరుచికూడ యక్షగానాలవైపు మొగ్గుచూపుతూ ఉండింది. బలభద్రదాసికి పూర్వం బాలపాపాంబ [క్రీ॥ శ॥ 1600] అక్కమహాదేవిచరిత్ర అన్న యక్షగానాన్ని రచించింది. తెలుగులో స్త్రీచే రచింపబడిన మొదటి యక్షగానమిది. పైన తెల్పిన కవయిత్రుల ప్రభావం ఈ కవయిత్రిపై ఉండవచ్చు. కాన ఈమె కవయిత్రియేగాని కవి కాదు అని చెప్పవచ్చు.

## IV. కవికాలం :

కవికాలాన్ని నిర్ణయించడానికి ప్రధానంగా క్రింది పద్ధతుల్ని అనుసరించవచ్చు.

### 1. కృతిభర్త ఆధారంగా :

కవి తన కృతిని అంకితమిచ్చిన రాజో, సామంతరాజో, మంత్రో, దండనాయకుడో లేక చరిత్ర ప్రసిద్ధమైన వ్యక్తో తెలిస్తే దాన్నిబట్టి చారిత్రక గ్రంథాల ఆధారంగా, గెజిట్లు, కైఫీయత్తుల ఆధారంగా కవి కాలాన్ని నిర్ణయించవచ్చు. ఒక్కొక్కసారి కృతి నరాంకితంకాక దైవాంకితమయినపుడు ఈ పద్ధతి అంతగా పనికిరాదు.

### 2. ఆశ్వాసాంతగద్య ఆధారంగా :

ఆశ్వాసాంత గద్యలో కవివంశం, తల్లిదండ్రులు, బిరుదులు, ఇతర రచనలు తాను ఆశ్రయించిన రాజులు మొదలైన అంశాలు ఉంటాయి. ఆ అంశాల ఆధారంగా కవికాలాన్ని నిర్ణయించడం ఇంకోపద్ధతి.

### 3. చారిత్రక సంఘటనల ఆధారంగా :

చారిత్రక సంఘటనల్ని కావ్యంలో వర్ణించి ఉంటే దాన్నిబట్టి కవి కాలాన్ని నిర్ణయించవచ్చు. ఒక రాజుయొక్క చరిత్రను అతని కొలువులోని

కవులే రచించినపుడు, లేక కొన్ని చారిత్రక సంఘటనలు తన కాలంలో జరిగినట్టు కవి స్వయంగా చెప్పుకొన్నప్పుడు ఈ పద్ధతిని అనుసరించవచ్చు.

ఇదిగాక తమను ఆదరించిన రాజులకు సంబంధించిన విషయాలు కవి వెలువరించినపుడు, ప్రసిద్ధులైన వ్యక్తుల్ని తమ గురువుగా చెప్పుకొన్నప్పుడు, తమ సమకాలికులైన కవులనుగూర్చి వ్రాసికొన్నప్పుడు, పూర్వ కవులస్తుతి ఆధారంగా తన తరువాతి కవులు తనను స్తుతించినపుడు కవి కాలాన్ని నిర్ణయించడానికి వీలుంది.

పైన వివరించిన ఆధారాలు ఏవీ మనకు దొరకనపుడు, కవి వ్రాసిన ప్రక్రియను ఆధారంగా, శైలిని ఆధారంగా తీసికొని కొంతవరకు కవికాలాన్ని నిర్ణయించవచ్చు. ఇదిగాక కవి స్వయంగా తన కాలాన్నిగూర్చి స్పష్టంగా చెప్పుకొన్నప్పుడు లేక కవియే స్వయంగా తాళపత్ర ప్రతిని వ్రాసినపుడు, వ్రాయసగాని కాలాన్నిబట్టికూడ కొంతవరకు కాలాన్ని నిర్ణయించవచ్చు.

కపోతవాక్యాన్ని రచించిన కవయిత్రి బలభద్రదాసియొక్క కాలాన్ని గూర్చి తెలుసుకోవడానికి సాహిత్య చరిత్రలో ఆధారాలు మృగ్యం. అయినా ప్రక్రియ ఆధారంగా, తాళపత్ర ప్రతి ప్రాచీనతను ఆధారంగా మనం ఈ కవయిత్రి కాలాన్ని కొంతవరకు నిర్ణయించవచ్చు.

ఈ పరిష్కరణకు ఉపకరించిన ప్రతులు నాలుగు. అవి ABCT అని సంకేతింప బడ్డాయి వీటిలో A ప్రతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని D 1844 అనే సంఖ్య గలది. B ప్రతి సంఖ్య 1845. C ప్రతి సంఖ్య D 1846. T ప్రతి తంజావూరు సరస్వతీ మహలు లోనిది M 474 నెంబరు గలది.

A ప్రతి లేఖనకాలం విరోధినామ సంవత్సరం, మాఘమాసం ఆదివారం 15 వ తేది. అంటే క్రీ. శ. 1830 వ సంవత్సరం ఫిబ్రవరినెల ఆదివారం 7 వ తేది అన్నమాట.

B ప్రతి విరోధినామ సంవత్సరం కార్తికమాసం భానువారం 5 వ తేది వరకు వ్రాయబడింది. అంటే క్రీ. శ. 1829 నవంబర్ 1 వ తేది అయినా కావచ్చు 15 వ తేది అయినా కావచ్చు.

C ప్రతి సౌమ్యనామ సంవత్సరం జేష్ఠమాసం బహుళ 10 న వ్రాయబడింది. ఇందు వారం తెలియజేయబడలేదు కాన 1789 లోనో 1849 లోనో వ్రాయబడి ఉండవచ్చు.

T ప్రతి నళనామ సంవత్సరం చైత్రమాసం బహుళ 10 వరకు వ్రాయబడింది అనగా 1736 లోనో, 1796 లోనో, 1856 లోనో వ్రాయబడి ఉండవచ్చు. కాని ప్రతి ప్రాచీనతనుబట్టి 1796 లో వ్రాయబడి ఉండవచ్చు. కాని C, T ప్రతుల రచనాకాలం నిర్దుష్టంగా తెలియజేయక పోవడంవల్ల దొరికినప్రతులలో ప్రాచీనమైనది B ప్రతి. దీని రచనాకాలం 1829. కావున ఈ కవయిత్రి 1829 కి పూర్వం ఉండి ఉండవచ్చునని 'ఆంధ్ర యక్షగానవాఙ్మయ చరిత్ర'లో డా॥ యస్. వి. జోగారావుగారు అన్నారు.

కపోతవాక్యాన్ని కవయిత్రి వ్రాయడంవల్లనూ, నాయకరాజులు, మహారాష్ట్రులకాలంలో వస్తు వైవిధ్యం కల్గిన ఎన్నో యక్షగానాలు వెలువడడం వల్లనూ అనాటికి యక్షగానాలకు మిక్కిలి ఆదరణలభిస్తూ ఉండడంవల్లనూ, పండిత పామరజనామోదమైన ఈ ప్రక్రియలో కపోతవాక్యం వెలువడడం వల్లనూ, మనకు దొరికిన ప్రాచీన ప్రతి AD 1829 కి సంబంధించినది కావడంవల్లను ఈ కవయిత్రి 17 వ శతాబ్ది ఉత్తరార్థంలోనో, లేక 18 వ శతాబ్ది పూర్వార్ధంలోనో ఈ కావ్యాన్ని రచించి యుండవచ్చు.

## V నివాసము :

భలబద్రదాసి తన కావ్యాన్ని కప్పరములోని చెన్నకేశవస్వామికి అంకితమిచ్చింది. ఈ కప్పరము అన్న గ్రామ ప్రసక్తి శాసనాలలోగాని, జిల్లాగెజిట్లలోగాని కనిపించదు. కాని గుంటూరుజిల్లా [ప్రస్తుతం ప్రకాశంజిల్లా] అద్దంకి తాలూకాలో 'కొప్పరము' అన్న గ్రామం ఉన్నట్లు శాసనాధారాలు ఉన్నాయి. ఆ గ్రామంలో మల్లేశ్వరస్వామి దేవాలయం, రఘుపతిస్వామి దేవాలయం ఉన్నట్లు ఆధారాలు ఉన్నాయి. కాని చెన్నకేశవస్వామి దేవాలయం ఉన్నట్లు ఆధారాలు లేవు.

ఇక నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలో 'కప్పరంపాడు' అన్న గ్రామం ఉంది. అందు చెన్నకేశవస్వామి దేవాలయంకూడ ఉంది. ఇదిగాక

నెల్లూరు జిల్లాలో బలభద్ర ఇంటిపేరుగలవారు కూడ ఉన్నారు. కావున ఈ జిల్లాలోని 'కప్పరంపాడు' గ్రామమే కప్పరము. అందున్న చెన్నకేశవ స్వామియే ఈ కవయిత్రి ఆరాధ్య దైవం. అందువల్ల ఈమె నెల్లూరు జిల్లాకు సంబంధించిన కవయిత్రి అని చెప్పవచ్చు.

## VI కావ్యేతివృత్తం :

ప్రస్తుత కపోతవాక్యం తిక్కన భారతం శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 307వ పద్యంనుండి 341వ పద్యంవరకు మొత్తం 34 పద్యాలలో ఈ ఇతివృత్తం చెప్పబడింది. ఇదే ఈ యక్షగానానికి మూలం.

వాల్మీకి రామాయణంలో ఈ వృత్తాంతం—

శ్రూయతే హి కపోతేన శత్రు శ్శరణమాగతః

అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసై ర్నిమంత్రితః

సహితం ప్రతి జగ్రాహ భార్యా హర్తార మాగతమ్

కపోతో వానరశ్రేష్ఠ కింపున ర్మద్విధో జనః—*

—అని చెప్పబడిఉంది. అంటే తన్ను శరణువేడిన శత్రువునకు కపోతం తన శరీరాన్నే ఇచ్చి అతణ్ణి రక్షించిందని భావం.

బ్రహ్మాండ పురాణంలోకూడ ఈ వృత్తాంతం ఉంది. గౌతమీనది తీర్థాలలో 'కపోతతీర్థ' మొకటని చెప్పుతూ ఈ కథాఘట్టం అక్కడ చెప్పబడి ఉంది. తమకు అపకారం తలపెట్టి తమనే శరణువేడిన ఎరుకలవాని ఆకలి తీర్చడానికి కపోతియేగాక కపోతంకూడ చితినెక్కడం, ఎరుకునకు జ్ఞానోదయం కల్గి, తనకు సన్మార్గం చూపమనడం, గౌతమిలో స్నానంచేసి, దైవాన్ని ధ్యానించి, ఆ మలినదేహాన్ని వదలి మోక్షాన్ని పొందుమని ఉపదేశించడం అదేవిధంగా చేసి ఎరుకు మోక్షాన్ని పొందడం ఇందు వర్ణింపబడింది.

భారతం శాంతిపర్వంలోని ఇతి వృత్తాన్ని తీసికొని కొందరు వచన కావ్యంగా, కొందరు పద్యకావ్యంగా కపోతవాక్యాన్ని రచించారు.

---

* శ్రీ రామాయణే - యుద్ధకాండే - అష్టాదశ సర్గః 24, 25 శ్లోకాలు.

కపోతవాక్యాన్ని వచనంగా వ్రాసినవారు ఇద్దరు.

1 వి. నాగయ్య. ఈ కావ్యం 1900 లో ప్రచురితం.

2. కోనయ్య. ఈ కావ్యం 1913 లో ప్రచురితం.

కపోతవాక్యం ద్విపదలోకూడ రచింపబడింది. ద్విపదలోని 'కపోత వాక్యం' రచనల తాళపత్ర ప్రతులు ఐదు ఉన్నాయి. ఇవి స్వతంత్ర ప్రబంధాలవలె రచింపబడ్డాయి.

D 1035 ప్రతి. దీని కర్త ఔబళయ్య, సర్వయకొడుకు.

D 1036. కర్త ఆర్వేల నియోగి వెంకటగిరి. కృతి వేంకటేశ్వరుని కంకితం. ఈతని కాలం తెలియదు. ఇందలి ఇతి వృత్తానికి మూలం భారత శాంతి పర్వంలోని కపోతోపాఖ్యానమే. 'జ్ఞానానందమయ' మన్న శ్లోకంతో ప్రారంభించి, విభీషణుడు తన్ను శరణువేడ వచ్చినపుడు శ్రీరాముడు సుగ్రీవునకు శరణాగతుడైన వానిని గాచుట తమ ధర్మమని, పూర్వం పక్షులుకూడ శరణాగతుడైన వానిని గాచినవని ఈ కథను చెప్పుతాడు.

ఔబళయ్య, వెంకటగిరి కృత ద్విపదకావ్యాలు రెండూ ఒకే మూలం నుండి రచించియుండటం బోయవానిని వర్ణించిన సందర్భమందలి ద్విపదలు ఒకేవిధంగా ఉండటంవల్ల రెండును ఒకే మాతృకకు ప్రతులేమో అన్న సందేహం కల్గుతూఉంది. కాని గ్రంథకర్తలు వేరువేరుగా అవతారికలో పేర్కొన బడినారు. ఇది ఎలా జరిగిందో తెలియడంలేదు.

ఔబళయ్య కావ్యానికి వేరొక ప్రతి తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయంలో ఉంది (M No. 371). కాని దానిలో అవతారిక భాగం లేదు. కర్తృనామం తెలియదు. కాని రచనావిధానం రెండింటిలో (D 1035 మరియు C. M. No.371) ఒకేవిధంగా ఉంది.కాన దీనికర్త ఔబళయ్యేనని భావించడం జరిగింది.

ఇదిగాక తంజావూరు పుస్తకశాలలోని M 355 సంఖ్యగల 'రామకథ' లో కూడ ఈ కపోతవాక్య కథే ఉంది.

R 1038, R 1039 ప్రతులుకూడ ఈ కథేతివృత్తాన్ని కల్గి ఉన్నాయి.

R 1038. ఇది భారతకథ గాక, కల్పితకథ గలది. కవిపేరు తెలియదు. విభీషణుడు శ్రీరాముని శరణు వేడినపుడు సుగ్రీవుడు అభ్యంతరం చెప్పుతాడు. అప్పుడు ఒక కపోతం వచ్చి శ్రీరామునితో విభీషణుని చేరదీసి తన శరణాగత వత్సలత్వాన్ని చాటుకొమ్మని హెచ్చరిస్తుంది. రాముడు విభీషణుని చేరదీసి ఆతనిని లంకాధీశుని చేస్తాడు. అప్పుడు శరణాగతులను రక్షించడం ధర్మమని శ్రీరాముడు సుగ్రీవునితో కపోత వృత్తాంతాన్ని చెప్పడం ఈ కావ్యమందలి కథ.

R 1039. కర్త తెలియదు. కాని అతడు కందాళ వరదయాచార్యుని శిష్యుడనిమాత్రం చెప్పబడిఉంది.

ఈ కపోతవాక్య ఇతివృత్తాన్ని తీసికొని ఆధునికులు కూడ పద్య కావ్యాలు రచించారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'కపోతకథ' అన్న పేరు తోను, తుమ్మల సీతారామమూర్తిచౌదరి 'ఆత్మార్పణము' అన్న పేరుతోను లఘుకృతులు రచించారు.

## VII కవితా విశేషాలు :

### (a) కథా సంవిధానం :

కపోతవాక్యము పక్షులకు సంబంధించిన కథ. అయినా కవయిత్రి చాల చాకచక్యంగా పక్షుల్ని మరపింపజేసి పరోపకారార్థం తమ ప్రాణాల్ని త్యాగంచేసిన ఓ పుణ్యదంపతులను తలపింపజేసింది. ఎన్నో లోకనీతుల్ని కపోతిద్వారా వల్లించింది. కేవలం శ్రవ్యార్హమైన ఈ కావ్యాన్ని దృశ్యార్హమా అన్నట్లు రచించింది.

విభీషణుడు తన అన్న రావణునిచే భంగపడి శ్రీరాముని శరణు కోరుతాడు. విభీషణుడు శత్రురాజు తమ్ముడని వానికి శరణివ్వడం మంచిది కాదని సుగ్రీవాది వానర ప్రముఖులు రాముడికి సలహా ఇస్తారు. అప్పుడు రాముడు శరణన్న శత్రువును కాపాడి వానికోసం తమ ప్రాణాలనే త్యాగం చేసిన ఓ కపోతజంట కథను వినిపించడం ఇందలి ఇతి వృత్తం.

(b) వర్ణనలు :

వర్ణన కవి భావనకు సంబంధించినది. కవి ప్రకృతిలో తాను చూచిన ప్రతి కదలికను మననంచేసి కవితా బద్ధమొనర్చుతాడు. డా. కె. వి. ఆర్. నరసింహంగారు "వర్ణనలు కవులు తమ పాండిత్య ప్రకర్షకునై చేయరాదు. దృశ్యము కన్నులకు గట్టినట్లు చేయుటకు కథాకథనము పేలవముగాకుండ నూత్న చైతన్యమును కలిగించుటకును వర్ణనము లావశ్యకములైయున్నవి"* అన్నారు.

ఈ వర్ణనలు వైవిధ్యాన్నిబట్టి నాల్గు రకాలుగ వర్గీకరించవచ్చు.

(1) కథాపరములైన వర్ణనలు.
(2) కాలసూచక వర్ణనలు.
(3) రసానుగుణ వర్ణనలు.
(4) పాత్రానుగుణ వర్ణనలు.

1. కథాపరములైన వర్ణనలు :

కథ నడవడానికి పాత్ర ప్రవేశానికి సన్నివేశాల చిత్రీకరణకు అనువయిన వాతావరణం కల్పించే వర్ణనలు కథాపరములైనవి.

కపోతవాక్యంలో రావణాసురునిచే రాజ్య బహిష్కరణ పొందిన విభీషణుడు రాముని శరణుకోరుతాడు. అప్పుడు 72 వేల కపిసైన్యం విభీషణునికి శరణివ్వరాదని కోపించే విధానాన్ని వర్ణిస్తూ వారి కోప ప్రభావానికి చుక్కలు కాంతిహీనమైనాయని, సూర్యుడు తన తాపాన్ని తగ్గించుకొని వెచ్చగా మారాడని, చంద్రుడు కందిపోయాడని, మేఘమండలం బెదిరిందని వర్ణిస్తుంది. ఇక్కడ సూర్య చంద్రాదులు, వాయువు మేఘాలు తమ సహజగుణాన్ని బాసి భయపడసాగాయని చెప్పడంవల్ల కపిసైన్యం విభీషణునిపై కనుపరచిన కోప తీవ్రతను వ్యక్తపరచే వర్ణనచేసి ఈ కవయిత్రి కథకు అందాన్ని కూర్చింది.

ఇక ఈ కథలోని మర్రిచెట్టు వర్ణన ఈ కవయిత్రి భావుకతకు చక్కని నిదర్శనం.

---

* ఆంధ్ర ప్రబంధములు - డా. కె. వి. ఆర్. నరసింహం.
పుట. 78, 80.

"హరికి తల్పంబాయెనా మర్రాకు తొల్లి మునులు
సురలును జూడ వత్తు రందుల చోద్యమెల్ల
నాగకన్యలు సమరకన్యల నాడ బిల్వ బోదురు
బాగుగా మర్రియూడలు బట్టుకొనుచున్
గ్రహణకాలమునాడు చంద్రుని గరప రాహువు
లహరహము లా మర్రికొమ్మల నణగియుండెన్
మగ్గి యొండల మర్రియాకులు మబ్బుకొనగా పోకిటు
బాగు దాపని యినుడు దక్షిణభాగ మరిగెన్"—

—అని వర్ణించింది. ఈ మర్రిచెట్టు ఆకుపై హరి పవళించి వుండడంవల్ల ఆ చెట్టును చూడడానికి మునులు సురలు వస్తారట. అందలి వూడలు దేవకన్యలు నాగకన్యలు ఆడుకోవడానికి అనువుగా ఉన్నాయట. ఆ చెట్టు దట్టంగా ఉండి చీకటి అలుముకొని ఉండడంవల్ల రాహువు చంద్రుని మింగడానికి అందులో దాగుకొని ఉన్నాడట. ఆ చెట్టు ఎంత దట్టంగా ఉందంటే సూర్యుడు తన కిరణాలని అందు చొప్పించడానికి భయపడేటంతటి చీకటి ఉందట. మర్రి చెట్టును ఆశ్రయించిన ప్రతివాళ్ళు గొప్ప చరిత్రగలవారే. ఇలాంటి మర్రి చెట్టును ఆశ్రయించిన కపోతాలుకూడ గొప్పవే అన్నధ్వని ఈ పాటలో ఉంది.

ఇలాగే ఎరుకువాడు ఆ కపోతిని పట్టుకొన్నప్పుడు వర్ణించిన వర్ష వర్ణన, మగ కపోతం ఇంతిలేని గృహాన్ని వర్ణించినతీరు, అనలంలోపడ్డ కపోతకుని చూడడానికి వచ్చిన శ్రీహరి ఆగమన వర్ణన, సురలకు యమసేనలకు జరిగిన యుద్ధవర్ణనలు మొదలైనవి కథాపరములైన వర్ణనలే.

2. కాలసూచక వర్ణనలు :

కావ్యాలలో సూర్యాస్తమయాది వర్ణనలు కాలాన్ని సూచించడానికై చేయబడతాయి.

(అ) సూర్యాస్తమయ వర్ణన : వేటకు వెళ్ళిన ఎరుకువాడు అడవిలో వున్న మర్రిచెట్టుపై ఉచ్చు పొడ్డుతాడు. ఇంతలో సూర్యుడు అస్తమిస్తాడు. ఆ సందర్భంలో కవయిత్రి-

"రక్కసుల దునుమాడి హరిజలరాశి కడుగదెచ్చిన
చిక్క చక్రమురీతి భానుడు పశ్చిమ జలధి గ్రుంకెన్"

అని వర్ణిస్తుంది. ఇక్కడి సూర్యాస్తమయ వర్ణన కవయిత్రి వర్ణనా పటిమకు చక్కని నిదర్శనం. పాప పంకిలులైన రాక్షసులను సంహరించడంచేత శ్రీహరి చక్రానికి దోషం అంటుకొనింది. ఆ దోషాన్ని పోగొట్టుకోవడానికి శ్రీహరి తన చక్రాన్ని జలరాశిలో కడగడానికి తెచ్చాడు. ఆ చక్రంవలె సూర్యుడు ఉన్నాడని వర్ణించింది.

సూర్యుడు దోషనివారణకై పశ్చిమజలధిలో క్రుంకాడనటాన్ని మన కవులు కొందరు వర్ణించారు. మత్స్యపురాణంలో దోషాకరుని ముఖదర్శన దోషానికి సూర్యుడు జలధిలో క్రుంకాడని, బ్రహ్మోత్తర ఖండంలో పద్మినితో సంగమం చేయడంవల్ల ఏర్పడిన దోషాన్ని మాపుకొనడానికి పశ్చిమాంబుధి లో క్రుంకాడని వర్ణింపబడిఉంది.

(ఆ) చంద్రోదయ వర్ణన :

సూర్యాస్తమయ వర్ణనను వెన్నంటి చంద్రోదయ వర్ణన చేయబడింది.

"చీకటను రక్కసుల మీదికి సిరివరుండు శరముల
తాకనేసినరీతి దివ్వెలు తరచు మెరసెన్.
నీలిపరులమీద ముత్యపుప్రాలు రాశిదీర్చిన
లీల చుక్కలలోన చంద్రుడు చాలనొప్పెన్.
మరుడు విరహుల మీదజల్లినమందు భూతియనగను
వెరపునను వెన్నెలలుగాసెను విరివిగాను"—

పై పంక్తులలో కవయిత్రి చంద్రుని ముత్యపుప్రాలు రాశిగా మరుడు విరహులమీద చల్లిన మందుభూతిగా ఉత్ప్రేక్షించింది. నీలి పరులమీద నున్న ముత్యాలు స్వచ్ఛంగా, ధవళకాంతుల్ని ప్రసరిస్తూ ఉంటాయి. ఇక్కడ చంద్రుని నీలిపరులమీది ముత్యాలుగా పోల్చడంవల్ల చంద్రుని యొక్క స్వచ్ఛతను, విరహులమీద చల్లిన 'మందుభూతి' అనడంవల్ల చంద్రకిరణాల తాడనకు స్త్రీలు తమను తామే మరచిపోవడాన్ని సూచిస్తుంది. దీన్ని వెన్నంటి చంద్రోపాలంభనం వర్ణించబడింది.

(ఇ) సూర్యోదయ వర్ణన :

ఈ యక్షగానంలో సూర్యాస్తమయ చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలు ఒకదాని తర్వాత ఒకటి ఒకే సందర్భంలో వర్ణింపబడినాయి. ఈ వర్ణనలు కథానుగుణంగా చేయబడినవి. ఎరుకువాడు ఉరులొడ్డడంతో ప్రారంభమైన సూర్యాస్తమయ వర్ణన చంద్రోదయంతోను, సూర్యోదయంతోను ముగుస్తుంది. బలభద్రదాసి సూర్యోదయాన్ని వర్ణించిన తీరును పరిశీలిద్దాం.

"బల్లిదపు రతికేళి పణతుల-పట్టి పెనగి పురుషులు
అల్లి బిల్లైపోయిరంతట నలసి నిద్ర
తారలును శశియుడిగె-జారుల తమక ముడిగె శుక్రుడు
తేరుకొన నుదయించె-తూర్పున తెల్లవారెన్"-

పై పంక్తులలో ప్రాతఃకాల వర్ణన చేయబడింది. ఇక సూర్యోదయాన్ని వర్ణిస్తూ.

'కలువలును ముకుళించె - తామరసుమములు విరిసె, చయ్యన
నళినముల చెలికాడు తూర్పునగము కెక్కెన్'

అంటూందీ కవయిత్రి.

**8. రసానుగుణ వర్ణనలు :**

కావ్యంలో వర్ణనలన్నీ ప్రధానంగా రసోన్ముఖంగా చేయబడతాయి. కథ నిరంతరం రసానుగుణంగానే నడుస్తుంది. పాత్రలు రసానుకూలంగా ప్రవర్తిస్తాయి. కావ్యంలో ప్రతి అంశం రసపర్యవసాయమే. అయినా కొన్ని ముఖ్యాంశాలు రసదృష్టితో కొట్టవచ్చినట్లు వర్ణింపబడతాయి.

ఈ యక్షగానం ప్రధానంగా కరుణ రసాత్మకమయింది. ప్రతి ఘట్టంలోను కరుణ జాలువారుతుంది. ఇందు అంగిరసం కరుణమైనా వీరం, శృంగారం, అద్భుతం, శాంతం, అంగరసాలుగ పోషింపబడ్డాయి.

వర్షం వెలిసింది. మగ కపోతం తమ గూటికివచ్చి ఆత్రంగా తన చెలి కోసం వెతుకుతుంది. రాళ్ళు రువ్వినట్లు కురిసిన వర్షంలో తన చెలి ఏమైందోనని తలచుకొని నివ్వెరపాటు చెందుతుంది. ఆ సందర్భంలో కపోతకుని స్థితిని తెలియపరస్తూ రచించిన మాటలు కళ్ళనీళ్ళు తెప్పిస్తాయి.

'అంతట దాఁగిన - యా కపోతకుఁడు
ఇంతిని మదినెంచి - యీ వానచేత
ఎంత భీతిల్లెనో - యెఱుఁగరాదనుచు
చింతించి యెలుఁగెత్తి - చీరుచుఁ దిరిగె
అంతంత నిలిచి ప - ల్కాల కింపుచును
సంతాప మందుచుఁ - జని గిరి పొదల
వెదకుచు వేగంబె - విడిది కేతెంచి
చెదరిన యాఁకూడు - చెచ్చెరఁ జూచి
కలఁగి నివ్వెఱఁగంది - కన్నీరునించి
తలపోసి మదిలోన - తగ విచారించి'—

రంతుగా ఏడ్చినదట. ఇలా ఈ యక్షగానంలో ప్రతిఘట్టం కరుణ రసాత్మకమే.

తనకోసం ప్రాణత్యాగం చేసుకొన్న పావురాల్నిచూచి ఎరుకువాడు పశ్చాత్తాప పడి;

"అజ్ఞానమనియెడు - నంధకారమున
సుజ్ఞానదీపంబు - చూపిన కరణి
భవబంధములు - బాయ భావంబులోన
భువన రక్షకుఁదన - బుద్ధిలో నిలిపి"—

గ్రక్కున యమకింకరులచేతికి తన్ను అప్పగించవద్దని శ్రీహరిని ప్రార్థిస్తాడు. అటు యముసేన, ఇటు దేవతలు ఎరుకు వానిని తీసికొని వెళ్ళడానికి వచ్చారు. వారు ఒకరితో ఒకరు తలపడటాన్ని వర్ణించే సందర్భంలో వీరం పోషింపబడింది.

"అంతట యముసేన - యడ్డంబువచ్చి
పంతంబు లాడుచు - పట్టుక యెఱుకు
గొనిపోవుచుండఁగఁ - గోపించి సురలు

కనలు శరంబుల - ఘన గదాచక్ర
పరశు పట్టిశశూల - భద్రాయుధముల
గురియించి యార్చుచుఁ - గూడ నేతెంచి"-

దేవతలు కాలుని సేనను తాకినవి. అప్పుడు ఒకరిపై ఒకరు ఆయుధాల్ని వేసుకొన్నారు. ఆ దృశ్యాన్ని చిత్రిస్తూ కవయిత్రి

"దట్టంపు టలుఁగులు - దట్టుగా గురియు
వాన కాలంబైన - వరుసఁ జూపఱకుఁ
గాన వచ్చిన సేన - కరటి మేఘములు
ఝళిపించు రాహుతుల్ - ఘాయ ఖడ్గములు
తళుకులు మెఱుపులు - తగ గుణధ్వనులు
నుఱుములు శరములు - నుద్ధతి దాక
తొరఁగు రక్తంబులు - తోయముల్ మేను
పదునుగాఁదునియలై - పడిన మాంసములు
పొది నింద్ర గోపంపు - పురువులుగాఁగ
వానకాలమురీతి - వరుస బాణములు"-

కురిసినాయని వర్ణించింది. ఇక్కడ కవయిత్రి తిక్కన యుద్ధ వర్ణనలను తలపింప జేసింది. తిక్కన యుద్ధవర్ణనలు చేసేటప్పుడు యుద్ధంవల్ల ఏర్పడిన జుగుప్సను,భయానక దృశ్యాన్ని తొలగించడానికి రమ్యమైన వర్ణనలతో ఉపమించడం పరిపాటి. అలాగే ఇక్కడ కవయిత్రి యుద్ధాన్ని వర్షాకాలంతో పోల్చుతూ ఉంది. గుంపులవలె ఉన్న సైన్యాన్ని కారుమబ్బులుగ, కత్తులు ఒకదాన్ని మరొకటి తాకడంవల్ల ఏర్పడిన కాతుల్ని మెఱుపుల వెలుగుగ-తునాతునకలై పడిన శరీరాల్ని ఆరుద్ర పురుగులుగా వర్ణిస్తుంది. ఇక్కడ యుద్ధ వాతావరణమే మనకు స్ఫురించక వర్షాకాలమే గుర్తుకు వస్తుంది.

ఇక ఈ కవయిత్రి గావించిన ప్రాతఃకాల వర్ణనలల్లో శృంగారం పోషింపబడింది.

'బల్లిద పురతి కేళి పణతుల పట్టి పెనగి
పురుషులు అల్లి బిల్లై పోయిరంతట నలసినిద్ర'

ఇక్కడ బల్లిదవు రతికేళిచేత పురుషులు అలసిపోయి నిద్రిస్తూ ఉన్నారని వర్ణించింది.

4. పాత్రానుగుణ వర్ణనలు :

కావ్యంలో పాత్రల ప్రవేశ, ప్రవర్తనా, నిష్క్రమణాదుల్ని, రూపాన్ని వర్ణించే వర్ణనలు పాత్రానుగుణవర్ణన లవుతాయి.

ఈ యక్షగానంలో దేవ, అసుర, మానవ, వానర, పశుపక్ష్యాదులకు సంబంధించిన పాత్రలు వస్తాయి. ఇందు శ్రీరాముడు దేవగణానికి, విభీషణ, రావణపాత్రలు అసురగణానికి, ఎరుకువాడు, ఎరుకత మానవ వర్గానికి. సుగ్రీవుడు మొదలైనవారు వానరులకు, కపోతాలు పశుపక్ష్యాదులకు సంబంధించిన పాత్రలు అవుతాయి. శ్రీరాముడు, విభీషణుడు, సుగ్రీవుడు. రావణాది పాత్రలు కథ పుట్టడానికి దోహదం చేసినవి కాగా, కపోతాలు, ఎరుకువాడు ప్రధానపాత్రలు. ఎరుకత ప్రాసంగికపాత్ర.

శ్రీరాముడు ఆర్తత్రాణ పరాయణుడుగ మనకు దర్శన మిస్తాడు. తన్ను శరణు వేడిన విభీషణునికి అభయమిస్తాడు. విభీషణుడు శత్రుపక్షం వాడు. వానికి రాముడు అభయ మివ్వటాన్ని సుగ్రీవాది 12 వేల కపి సైన్యం వ్యతిరేకిస్తాయి.

సుగ్రీవుడు

"లంకనిచ్చితివి - రావణు ననుజున
కింకేపట్టణ - మిచ్చెదవతనికి ?"

— అనినప్పుడు

"శరణు జొచ్చిన యట్టి - శత్రువుఁగాచి
పరగ నయోధ్యకుఁ - బట్టంబుగట్టి
చెలిమితో సేవింతు - నెల్లకాలంబు
తలపోయ నేటికి ? - తప్పదీపలుకు" అనే వాక్యాలు

తుదకు తన రాజ్యాన్నే విభీషణునికి ఇవ్వడానికి తలపడిన రాముని శరణాగత వత్సలౌన్నత్యాన్ని చాటుతుంది.

ఇక విభీషణుడు రావణుని తమ్ముడు. తన అన్న దుర్మార్గాన్ని గర్హించినవాడు. దుర్మార్గాన్ని వదలమని నీతిని బోధించి తుదకు రావణునిచే భంగపాటునొంది శ్రీరాముని శరణు వేడిన వాడు. తన అన్నకు శత్రువైనా శ్రీరాముని గొప్పతనాన్ని గుర్తించినవాడు. శ్రీరాముని సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగ గుర్తించిన భాగవతుడు. నీతిమంతుడు.

ఈ కావ్యంలో ప్రధాన పాత్రలు కపోతాలు. మగకపోతం యొక్క గొప్పదఁ కపోతి మాటలలోను, కపోతియొక్క గొప్పదనం కపోతం యొక్క మాటలలోను ద్యోతక మౌతుంది.

కపోతి ఎరుకువాని 'భయదంపుటురులలో' దగులు కొంటుంది. అప్పుడు తనపతి గుణములు తలచి ఇట్లను కొంటుంది.

'పరసతిఁగూడవు – పరనిందసేయ
వరయంగ కల్లనీ – యాత్మలో లేదు
నిర్మలాత్మకుఁడవు – నీతిమంతుఁడవు
కర్మంబు లెన్నడు – గానవునీవు.'

అంటూ ఒంటరిగా ఈ అడవిలో ఎలా ఉంటావోగదా అనుకొంటుంది. తుదకు తనసతి, ఎరుకు వాని చలిదీర్చుమని చెప్పినప్పుడు క్రూరునితో స్నేహం తగదని వాదిస్తుంది. 'ఏనాటిచుట్టంబె - ఎఱుకునీకు' అని తన సతిని తూల నాడుతుంది. వానిని కావడానికంటె విషం తీసుకొని నీతో మరణిస్తా నంటుంది. అయినా కపోతి తన 'ప్రాణవల్లభుని'కి ఎన్నో నీతులు బోదిస్తుంది. తుదకు కపోతం 'పురవని పొదరిండ్లలో నున్నబిదుగులు' దెచ్చి నోటితో కొరివితెచ్చి రెక్కలతో గాలి విసరగా మంట ఘనముగా మండి ఎరుకువాని చలిదీరి 'ఆకలనియెడు తెగులు అధికముగ నాయె'ను. తన ఆకలి తీర్చుమని కపోతాన్ని ఎరుకువాడు అడుగగా 'అశనమిమ్మని అడిగినపుడే ఆదరించి కావని కష్టుని కాయమేల?' అని చింతించి తన మనస్సుకు బుద్ధి చెప్పుకొనే సందర్భంలో కపోతం యొక్క మనస్సు ప్రతిబింభిస్తుంది.

'ఆయుష్షు నిత్యంబని నీ వెప్పుడు – కాయము నమ్మకు జన్మమా!!
మాయల బ్రతుకని మనమున నెంచి – సేయవె దానము జన్మమా

తలకకు నెవ్వరి జన్మమా ! హరి – దలచి మెలగు జన్మమా !
అద్దపు నీడని హరినెపుడు నీ – బుద్ధిలో దలచవే జన్మమా !
సాయుజ్యమునకు సోపానంబని – సేయువె చెప్పెద జన్మమా !
కాయజ గురుడగు కప్పరచెన్నుని – పాయకదలచవె జన్మమా !

—అని తలపోసి ఎరుకువానితో తాను అగ్నిలో పడెదనని తనను విరిచి భక్షించుమనిచెప్పి 'మనసులో హరి నిల్పి మదినోడు మఱచి కనలెడు నగ్నిలో గ్రక్కునఁబడియె' ఇలా ఈ కావ్యంలో కపోతకుని యొక్క త్యాగ నిరతి, సతిపైగల ప్రేమ, దేవునిపైగల భక్తిభావం, తాత్త్వికచింతన మనకు దర్శనమిస్తుంది.

ఈ కావ్యంలో కపోతి నీతిని బోధించే ఒకయోగినిగా మనకు కనబడుతుంది. పతివ్రత ధర్మాన్ని, పరోపకార ఔన్నత్యాన్ని చాటి చెప్పుతుంది, కపోతకుడు కపోతి యొక్క గుణాల్ని తలచుకొని

'ఏమని తిట్టిన – నెడయక నెపుడు
కోమలి ! నాయెడ – కోపంబులేదు
నీవంటి గుణవతి – నీవంటిప్రియను
నీ వంటిజవరాలి ... నే నెందుఁగాన
ఇతరుల కీగుణం – బెఱుగంగరాదు
మతిమంతురాలవు – మగువలలోన
అతివరో ! నీవంటి – అనుకూలవతిని
ఈ తరుణులలోన – నెందును గాన.'

నని విలపించే సందర్భంలో కపోతి గుణవతిగ, మతిమంతురాలిగ అనుకూలవతిగ మగ కపోతకుని మెప్పును పొందింది.

ఇంకా

"మతిచెప్ప నెడ మంత్రి – మన్నించు నెడ ధాత్రి
రతిసల్పు నెడ రంభ – రసికత మెఱయన్

గతికి సోపానంబు - కర మొప్పగా నరసి
సతతమును రక్షించు - నిజనాథవలెను
పతిభక్తితో దూతను - పనిసేయు నెడదాసి"

అంటూ సతికి ఉండవలసిన ఆరుగుణాలు కపోతిలో ఉన్నాయని అంటుంది. ఇక పరోపకార ఔన్నత్యాన్ని చాటేటప్పుడు ఈమె నీతినిధిగా దర్శన మిస్తుంది.

"ఇలలోనఁ దనకీర్తి - నిరవుగాఁ జేసి
బలియుండె హరిపాద - పద్మంబు క్రింద
సరవి తోడుత హరిశ్చంద్రుడను రాజు
పరఁగ బ్రాహ్మణు చేత - బంధింపఁబడియె
అజుఁడును తన కీర్తి - నఖిల లోకముల
భజనతో చదువులు - పాటించి నిలిపె
ఫాలనేత్రుని కీర్తి - ప్రబలె లోకముల
కాలకూటము తన - కంఠాన నిలుప
వసుధలోఁ గీర్తికై - వనజోదరుండు
పొసగుచు బలుమారు - పుట్టుచునుండె.

అంటూ కీర్తికై పాటుబడిన గొప్పవాళ్ళ చరిత్రల్ని వర్ణించింది. తుదకు సతి మాటల్ని మన్నించి ఎరుకువాని ఆకలి దీర్చ అగ్నిలోపడిన తన మగని తలచి ఎంతో దుఃఖించింది. మగడులేని విధవల బ్రతుకును కళ్ళకు కట్టినట్లు వర్ణించింది.

"కపట కల్మషముల - గట్టి బంధించి
పసిడిమై తన మేను - వన్నెయుఁ దఱిఁగి
విధవత్వమున చెవుల్ - వ్రేలాడ విడిచి
అతిదుఃఖమునఁ గుంది - వెతలచేఁ బడియు
ఉపవాస వ్రతముల - నుబ్బణఁగించి

తపసి వేషంబునఁ - దనపతిఁ దలఁచి
ఏక కాలము భక్తి - నేక భుక్తంబు
ఆకు పళ్ళెరమున - అనుభవించుచునూ

ఉండాలని చెప్పుతుంది. ఇంకా ముండను చూస్తే దోషమని, శుభ శోభనాలలో సుడియంగనీయరని అలాంటి విభులేని కాంతల విభవమేటికని అంటుంది. అందువల్ల తననుకూడ భక్షించుమని ఎరుకువానిని బ్రతిమలాడు తుంది.

ఇంకా,

"పతి గోరి అగ్నిలో - బడి వేదవతి కన్నె
అతిపుణ్య సీతయై - ఆరాము గలిసెన్
పతి బాసి గుల్లచన్నంబై (శ్రీ) గౌరి
గతి బొందియట కట - కంతు గలసెన్"

అంటూంది. ఇలా ఎరుకును బ్రతిమలాడి 'అనువుగ జలముల సంతోషంబున' స్నానము చేస్తుంది. ఆ తర్వాత నారాయణుని తలచి తన పాపాలన్నీ బాపుమని వేడుకొని అగ్నిలో పడి ప్రాణత్యాగం చేస్తుంది.

బలభద్రదాసి ఎరుకువాని రూపవర్ణన చేసేటప్పుడు సహజ సిద్ధంగా కన్నులకు కట్టినట్లు వర్ణించింది. ఎరుకు

"గూనివీపును, కురుచ చేతులు - గునుకు నడుపూ
తొట్రి నోరును తుట్టె పెదవులు - బుట్టముక్కు, వానికి
వెట్రి చూపును, గుడ్లు అతనికి - వెలికి నుబుకున్
తుప్పతలయును, దొప్ప చెవులును - దూడకడుపు వానికి,
చెప్పరాదు మేనికంపటు - చేరరాదూ
కందెన మసికల్పి పూసిన - కాంతివాడు, ఎపుడు
పందివలె బలిసుండు - పక్షుల పట్టి మెసగీ
చాల జీవుల జంపబుట్టిన - జముని రూపు జూచిన
కాలకింకరు కైవడిని మడి - కానవచ్చు.

తన ఇల్లాలు,

"పుల్లలు నెగడి దోచి - బుస్సున నూది
మల్లలో నొక కొంత - మాడిన కూడు"

వేస్తే కుండెడు వెలిబామ గంజితాగి బుస్సంచులేచి.

"గోచి నెంగిలి రుద్ది - గొబ్బున మొలను
కాసెగా నొక గుడ్డ - కట్టుకమరియు"

వేటకు కావలసిన చిక్కము, జిగిజంపువెదురు రెక్కల పచ్చని రెమ్మల తడక, పురిగల ఈకలు, ఊటి తాప్పరులు, గుముడుకము, వలలు, జిగురు గండెలు మొదలైన వేటసామగ్రిని 'బండివలె నన్నియు బరివోసికొనుచు'— వేటకు వెళ్లుతాడు. ఒక కపోతిని పట్టుకొంటాడు. వర్షంలో తడిసి ముద్దయి పోతాడు. చలినిదీర్చి తన ఆకలి తీర్చటానికి తన్నుతాను ప్రాణత్యాగం చేసుకొన్న కపోతం యొక్క చర్య ఎరుకువాని మనస్సును కదిలిస్తూంది. అప్పుడు తన వలలో చిక్కిన ఆడుకపోతిని వదిలివేస్తానని పక్షికులంలో కలిసి హాయిగా జీవించమని చెప్పుతాడు. కపోతి పతిలేని బ్రతుకు వ్యర్థమని తలచి అగ్నికి ఆహుతి అవుతుంది. దాన్ని చూచిన ఎరుకు కాంక్షను విడివి

"అజ్ఞానమనియెడు - నంధకారమున
నుజ్ఞాన దీపంబు - చూపిన కరణి
భవ బంధములు - బాయ భావంబులోన

భువన రక్షకుని తన మనస్సులో నిలిపి తన పాపాలను క్షమించి తనను యమకింకరుల కీయకుమని శ్రీహరిని త్రికరణశుద్ధిగా తలచుకొంటాడు. అలా శ్రీహరి దయతో కపోతాలతోపాటు తానుకూడ శ్రీహరి సన్నిధిని చేరుకొంటాడు.

ఈకావ్యలో పరమ కిరాతకుడైన ఎరుకువాడు కపోతాల యొక్క త్యాగానికి మనస్సు మార్చుకొని స్వర్గానికి చేరుకొంటాడు. ఈ ఎరుకువాని రూపవర్ణనను, 1036 (కపోతవాక్యము. ద్విపద)లో వెంకటగిరి కూడ కొంత సామ్యంతో వర్ణించాడు. అందులో ఎరుకువాడు నల్లని శరీరచ్ఛాయ గలవాడు. 'నడ్డినాశికము, పల్లవించిన కడుపు, పాముసాలుక, ఎఱ్ఱవి కన్నులు,

ఎనుబోతు ముఖము, పరుపైన ఉదరము, పరికి వెంట్రుకలు, అంటిన చెక్కులు, గండ్లమోము, ఘనమైన పెదవి, ఈచకాళ్లు, విరిచినవ్రేళ్ళు, పల్ల మీసములు, కలవాడుగ ఉన్నాడని వర్ణిస్తాడు.

ఇక ఈకావ్యంలో ఎరుకత వర్ణన చెప్పుకోదగింది. ఆమె దంతివలె ఉన్నదట. ఎరుకు తెల్లవారుజామున వేటకు వెళ్లుతూ తన సతిని లేపుతాడు. అప్పుడు ఆ ఎరుకత

"గొణుఁగుచు - నావులింపుచును
నంత రక్కసివలె - నా యింతి లేచె
మాల ముల్లులు మూల్గి - మగనిఁ దిట్టుచును
మెల్లన లేచి యా - యోగుల ముండ
జొల్లు సెలవుల వెంట - జొట జొటఁ గార
పేలు రాలెడి తల - పెడతల కణితి
వ్రేలాడు చెవులును - వెళుపాటి ముఖము
వ్రాలిన చన్నులు - వారచూపులును
నాలుగు చేతులై - నాతికి నమరు
తులువ చేతులు జూచి - తుప్పున నూచి
వెలికురికెడు పండ్లు - పెట పెట గొరికి
నిదురబోనీయవు - నీ బూడిదెత్త
పదరక నేటితో - పో పొమ్మటంచు"

లేచి వెలిచామ గంజికాచి తన మగనికి పోస్తుంది . ఇక్కడ ఎరుకత వర్ణన సహజంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించింది కవయిత్రి,

## VIII ఛంధస్సు :

కపోతవాక్యములో కందాలు, ద్విపదలు, వచనాలు కాక, నిడుద రేకులు, మధ్యమ రేకులు' మధ్యమనడలు, నడలు, జంపె, రేకులు, విరాళి, వరాళి పదాలు, కళికెలు, అనువులు, అర్ధచంద్రికలు, రగళలు, జాళపదాలు మొదలైన ఛందో వైవిధ్యంతో రచన సాగింది, కొన్ని ఛందోలక్షణ బద్ధంగాను, మరి

కొన్ని లక్షణానికి కుడియెడమగాను ఉన్నాయి. ఇలా ఉండటానికి కారణం కొంతవరకు ఊహించవచ్చు. యక్షగానాలు ప్రధానంగా గానం కోసం ఉద్దిష్టాలు. అందువల్ల ఇవి ముఖ్యంగా మాత్రాఛందస్సును ఆశ్రయించి ఉంటాయి. పాటను పాడేటప్పుడు ప్రతిపాదంలోను నిర్దేశించిన రీతిలో మాత్రలు ఉండవలసిన పనిలేదు. ఆయా పాదాల్లో ఒకటి రెండు మాత్రలు ఎక్కువ తక్కువలు కావచ్చు. ప్రస్తుతం ఈ కపోతవాక్యములోని ఛందో వైఖరిని పరిశీలిద్దాం.

నిడుద రేకులు - ఆటతాళం :

రేకులంటే రగడ వికృతులైన గేయ రచనలు, ఇవి తాళప్రధానాలు. ఆటతాళాన్ని సైతం రేకులనడం కలదు.

ఉదా :—

"మున్ను జెప్పిన బుద్ధులన్నియు-మూర్ఖమున, విననైతివయ్యో!
అన్నరేశ్వరు డొచ్చి యంబుధి - యమ్ముమొన బంధించెన్"

(పుట. 3.)

ఇందు ప్రతిపాదంలోను ఇరవైనాల్గు మాత్రలు ఉన్నాయి. ప్రాస నియమం ఉంది. ప్రతిపాదం ఒకటో అక్షరానికి పదవ అక్షరానికి యతి పాటింపబడింది. కాని ఈ పాటలో.

"బిరుదు లాడెడు వీరవరులా-బింక మెక్కడ బోయె నయ్యో !"

(పుట. 4)

అనే చరణంలో మాత్రం పంద్రెండవ అక్షరానికి యతి వేయబడింది.

మధ్యమనడలు-జంపె :

ఈ రగడ ద్విరదగతిలో నడుస్తుంది. అంటే నలల, నగ, భల, సల, త్వర గణములలో ఏవైనా నాల్గుగణాలతో నడుస్తుంది.

ఉదా :—

| ర | త | నల | నలల |
|---|---|---|---|
| సూర్యుడే | సుగ్రీవు | సురలెల్ల | కపులయిరి |
| త | సల | సల | న |
| ఆ రాఘు | వుడు విష్ణు - | డసురేశ ! | వినుము |

ఇందు రెండవ పాదంలో 'నగము' నకు బదులు నగణము ఉపయోగించ బడింది ప్రాస నియమం ఉంది.

**మధ్యమ రేకులు – ఆటతాళం :**

ఇందులోకూడ పాదానికి ఇరవైనాల్గు మాత్రలు ఉన్నాయి. అయినా మొదటి పాదంలో మూడు, రెండవపాదంలో ఒకమాత్ర ఎక్కువగా ఉన్నాయి. ప్రాసనియమం ఉంది.

ఉదా:—

"రావణేశ్వరు తమ్ముడను రఘురామ ! నీ పాదములకు నే
(27 మాత్రలు)

సేవ సేయగ వచ్చినాడను కావవే కరివరదా !"
(25 మాత్రలు)

(పుట. 8(

**నడలు – ఏకతాళం :**

యక్షగానాలలో 'కపోతవాక్యము'లో కన్పించే 'నడలు' అనే రేకు కొంత ప్రత్యేకమైన రచనా విశేషం కలది. ఇందు మధురగతి కన్పడుతు వుంది. అనగా నల, గగ. భ, స గణాలలో ఏవో నాల్గు ఉండాలి,

ఉదా.—

| నల | భ | భ | భ |
|---|---|---|---|
| "అనిలజ | యాతని | దోడ్కొని | రమ్మన |
| నల | నల | స | స |
| వనచర | పతిరఘు | పతికి | ట్లనియెన్ |

(పుట. 12

విరాళి పదాలు :

ఈ 'విరాళి' పదమే ఈ యక్షగానంలో 'వరాళి' పదంగాను, 'వర్ణం' గాను కనబడుతూ వుంది. ఈ ఛందస్సు ఒక్క బలభద్రదాసి కృత 'కపోతవాక్యము'లోనే ఉండటం విశేషం. విరాళి పదాలు సమపాదంలో 4×4=16, విషమపాదంలో 4+4+5=13 మాత్రల్ని కల్గి ఉంటాయి.

ఉదా:—

4 + 4 + 4 + 4

"కుచ్చిన ముత్యపు— కుందెన లోపల—16 మాత్రలు

4 + 4 + 5

అచ్చుగ కుంకుమ—లమరించి--13 మాత్రలు.

పచ్చలు దాపిన పసిడి రోకటను—16 మాత్రలు.

మెచ్చుగ దంపెద—రోలాల—13 మాత్రలు.

ఇందు ప్రాసనియమం పాటింప బడింది.

కళికెలు :

ఉదాహరణ కావ్యాలలో ఉపయోగింపబడిన రగడలను 'కళిక' లంటారు. రగడ రెండుపాదాల పద్యం. కళికలో ఎనిమిది పాదాలుంటాయి. అయితే రెండేసి పాదాలకు ఆద్యంత ప్రాసలు భేదింపవచ్చు. అనగా ఒకే ఛందో భేదానికి చెందిన నాల్గు రగడల మొత్తం ఒక 'కళిక'గా పరిగణింప బడుతుంది.

"డొంకపుటురు లంగు — పొంకము సేయుచు
పెంకుల కొయ్యన — క్రొంకి లాగుచును
పండిన తరువుల - కండె లొడ్డుచును
కొండ బిలంబుల — దండిగ జూపుచు
చాలగ వలలటు — చక్కగ నొడ్డుచు
మూలనున్న శశ - ముల దోలుచును
మేసేటి పక్షుల — మెడ నురి దగిలించి
తీసి తీసి మొలతిత్తిన — వేయుచు."

పైపాటలో ఆదిలోను అంత్యంలోను ప్రాసనియమం పాటింపబడింది. ప్రతిరగడలో ప్రాసనియమం వేర్వేరుగా పాటింపబడింది. కాని అంత్యంలో మాత్రం 'చ' కారంతో కూడిన ప్రాస ప్రతిపాదంలోను పాటింపబడింది.

కేవలం ఉదాహరణ కావ్యాలలో ప్రయోగింపబడే ఈ కళికల్ని కపోతవాక్యంలో ప్రయోగించడం విశేషం.

**అనుపులు :**

ఈ అనువుల లక్షణం ఒక్కొక్క యక్షగానంలో ఒక్కొక్కవిధంగా ఉంది.

ఉదా :

"పతిలేని ధాత్రియును - సతిలేని రాత్రియును
మతిలేని మంత్రియును - సుతిలేని తంత్రి"

(కపోత వాక్యము పుట. 36)

ఇందు జంపెగతి కనబడుతూవుంది.

"ఋషిమీర మహాగణంబులు గూడి చూడ, నాట్యము
లాడువాడు బుధోత్తములు గొనియాడువాడు.

(వీరబోడవ్వ చరిత్ర)

ఇందులో త్రిపుటగతి కలదు. కపోత వాక్యములో మొదటి పాదంలో ద్విరదగతి కన్పిస్తూవుంది. రెండవపాదంలో ఒకగణం లోపభూయిష్ఠంగా ఉంది.

**అర్ధ చంద్రికలు :**

చిత్రకవి పెద్దన, అప్పకవి త్రిపుట, జంపె మొదలయిన రేకులలో సగం పరిమితి గలవి అర్ధచంద్రికలని సూచించారు. ఇక్కడ 'చంద్రిక' అంటే రేకు అని అర్థం. ఉదాహరణ కావ్యాల్లో రగడ భేదాలైన కళిక, ఉత్కళికలు ఎట్టివో యక్షగానాల్లో ఈ అర్ధచంద్రికలు అట్టివి. మన యక్షగానాలలో రేకు లెంత ప్రాచీనాలో అర్ధచంద్రికలు కూడ అంత ప్రాచీనాలే.

"వినవయ్య! ఎఱుకు! ఇది – వివరంబుగాను
మనసరయ నీకొక్క – మాట చెప్పెదను."

**జాళపదాలు :**

ఇందులో అయిదు లఘుగణాలు, మూడు సూర్యగణాలు ఉండి రెండింటిపై ప్రాస ఉంటుంది. ఈ లక్షణం అప్పకవీయంలోని కర్ణాట చతుష్పద లక్షణానికి సరిపోతుంది. ఇందులో ప్రాసయతి ఉండటం విశేషం. ఇందలి నడక ద్విపదతో సామ్యం కల్గివుంది.

ఉదా:—

"గజరాజ వరద! ఓ భుజగాద్రి శయన!
గజముఖాశ్రిత శేష! త్రిజగవందితుడ!"

ఇలా యక్షగానంలో ఎన్నో దేశీ ఛందోరీతులు విలక్షణమైన ఛందోభేదాలతో ప్రయోగింప బడ్డాయి.

## IX పరిష్కరణ :

ఈ పరిష్కరణలో ఉపయుక్తాలైనవి మొత్తం నాలుగు ప్రతులు. అవి **A, B, C** మరియు **T** ప్రతులు ఇందులో **A, B, C** ప్రతులు మా శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలోనివి. 'T' ప్రతి తంజావూరు సరస్వతీమహాలుకు చెందింది. ఇంకొక ప్రతి కూడ తంజావూరు పరిశోధ నాలయంలో ఉంది. కాని అది మిగుల అసమగ్రంగా ఉండడంవల్ల దాన్ని గ్రహించలేదు. పరిష్కరణకు తీసికొన్న ప్రతులు నాలుగూ ఆద్యంతాలు కలవే. ఏ కారణం చేతనో ఒక ప్రతిలో గోచరించే పద్యాలు, పాటలు, వచనాలు మొదలైనవి మరో ప్రతిలో కనబడటం లేదు. అందువల్ల వాటిలో విశేషంగా వున్నదాన్ని పరిహరించక ఇందులో గ్రహించడమైనది. పై నాల్గింటిలో **A, C** ప్రతులు కొంత సమగ్రతను కల్గివున్నాయి. అందువల్ల **A, C** ప్రతులను ప్రధాన ఆధారంగా చేసుకొని, **B. T** ప్రతులను సంప్రదిస్తూ కథాక్రమాన్ని దృష్టిలో ఉంచుకొని పునర్నిర్మాణ పద్ధతి ప్రకారంగా ఒక సమగ్రప్రతిని తయారుచేశాను.

ఈ పరిష్కరణలో పాత్ర దృష్టితో వాడబడిన మాటలను యథా తథంగా గ్రహించాను. ప్రాచీన లేఖన సంప్రదాయం ననుసరించి వ్రాయ బడిన కొన్ని మాటలను నేటి లేఖనానుగుణంగా సవరించాను. కందం, ద్విపద మున్నగు వాటిలోని వ్యాకరణ దోషాలను వీలైనంతవరకు సవరించాను. ఇందులో ఏ సవరణ అయినా కవయిత్రి ప్రయోగించిన వ్యావహారిక భాషా స్వరూపపు పరిధిని అతిక్రమింపని రీతిలో కవయిత్రి హృదయానుగుణంగా అర్థస్ఫూర్తి కోసం చేసినవే నని చెప్పగలను.

గ్రంథ పరిష్కరణలో ఇది ప్రథమప్రయత్నం కావడంచేత ఏవైనా జారుపాట్లు దొరలి ఉండవచ్చు. అనుభవజ్ఞులైన పెద్దలు సౌహార్దంతో మన్నించి తెలియజేయగలరని, ఈ మార్గంలో ప్రోత్సహింపగలరని అభ్యర్థిస్తున్నాను.

బలభద్రదాసి విరచిత

# కపోతవాక్యము

## అటతాళం

[1]క్షీరసాగరమందు – శేషుని శయ్యమీద, వేడుక
సిరికి పరమై యున్న శ్రీనర – సింహు దలతున్. 1

గరుడవాహన మెక్కి దిక్కుల – ఘనతమించి, తానోక
తరుణివాహనమైన యల శ్రీ – ధరుని దలతున్. 2

[2]ధరణి సిరియను తరుణు లిద్దరి – దప్పకెప్పుడు, ఇరుగడ
పెటికపాటుగ[3]మోయు నాతని – ప్రేమ దలతున్. 3

అత్త నంటిన దోషమని జను – లాడుకొనగ, తెలిసిటు
అత్తపై పవళించు నాతని – యాత్మ దలతున్. 4

భావజగురు డిన్ని మాయల – [4]బరగి భువిని, మెలగిన
[5]దేవదేవుండైన కప్పుర – దేవు దలతున్. 5

---

1. శ్రీతరుణియు దానును శేషుని శయ్యమీద - A, C.
2. బరపు సరిపడ ధరణి సిరియను భామినులను ఇరుదెస - B.
3. మోచునాతని - B.
4. బరగినాడు, ఘనుడగు - B.
5. వాసుదేవుని కప్పుర శ్రీదేవు దలతున్ - B, C.

## ద్విపద

అట్టి శ్రీహరిపాద - మాత్మలో నిలిపి
పట్టి సేవింతునా - భక్తవత్సలుని

సోమయబసువని - సొబఁగు మీఱఁగను
ప్రేమతో బలభద్ర - [1]పేరొప్పఁబెట్టి

కరుణతో మన్నించి - గారవంబెసఁగ
వరమిచ్చె నొక మహా - వాక్యమూహించి

అది యెట్టిదన్న నయ - నానందగోష్ఠి
అది పరవుపకార - మది భవదూర
మది లోకవిఖ్యాత - మది లోకమతము
అది ముక్తి సోపాన - మది మూలధనము

అది పతివ్రతలకు - నది పట్టుఁగొమ్మ
అది పంచమశ్రుతియై - జగతిఁ బరఁగు

పక్షులు చేసిన - పరవుపకార
[2]యక్షగానంబుగా - నెల్లవా రెరుఁగ

కప్పరచెన్నుఁడు - కథ తన పేర
[3]చెప్పుచున్నాఁడిట్టి - చరితమంతయును

---

1. పేరొనరించి - T.
2. యక్షగానంబున—B.
3. చెప్పుచున్నాఁడిట్లు—B.

తప్పొప్పు లెరుగను - తనస్వామి కరుణ
[1]చెప్పిన యీ కథ - చేకొని వినుఁడి.

## కందము

రఘుపతి పంపున నప్పుడు
నగచరులా[2] వార్ధి గట్టి యార్చిన భీతిన్
*పొగలెగసిపోయె మింటికి
నగములు[3] లఘువుడిగి భూమి నాటుకయుండెన్.

## వచనము

ఇట్లు ఇనకులేశ్వరుండైన రామచంద్రుండు వనచరసేనచేత (వచ్చి) వనధి బంధింపగా, ఆ దనుజేశ్వరు తమ్ముండైన విభీషణుండు తమ యన్న రావణేశ్వరునితో ఏమనుచున్నాడు.

## నిడుదరేకులు - అటతాళం

మున్ను జెప్పిన బుద్ధులన్నియు - మూర్ఖమున వినవైతివయ్యా!
†అన్న రేశ్వరుడొచ్చి యంబుధి - యమ్ము మొన బంధించెన్ 1

1. చెప్పుచున్నాఁడిది చేకొనివినుఁడి—T.
2. వార్ధిదాటి—B.
* 'మొగిలెగసి' అని యుండవచ్చు.
3. లఘువీడి—B.
†'అన్న రేంద్రుడు వచ్చి' అని యుండదగును.

బిరుదులాడెడు వీరవరులా — బింకమెక్కడ బోయెనయ్యో!
తరుచరులు [1]వారధిగట్టగ† తరమబోలదె యేలయా? 2

అడవిలో రఘురాముసతి — నపహరించిటు దెచ్చితివి
వాడలితో నిన్నుండనీయుడు — వొప్పగించవె దేవిని. 3

## వచనము

అని యివ్విధంబున విభీషణుండు తన యన్న రావణేశ్వరునితో ఏమనుచున్నాడు.

## కందము

అన్న! విను రాక్షసేశ్వర!
ఎన్నఁగ రఘురాము[2]దేవి నిటదేఁ దగునా?
‡ నిన్నుంబ్రోచెడు దైవము
పన్నుగ నీదనుజకులము భస్మముసేయున్.

## వచనము

అని మరిన్ని విభీషణుండు తమ యన్న రావణేశ్వరునితో రామచంద్రుని జన్మంబును, కపుల జన్మంబును తెలియజెప్పుచున్నాడు.

---

1. వారధి దాటగ — C.

† 'తరుమబోవది యేలయా?' — అని యుండిన మరింత సొంపుగానుండెడిది.

2. లావు నెరుగుదు వేలా? — T.

‡ "నిన్నుంబ్రేచెను దైవము
పన్నుగ నీదనుజకులము భస్మముసేయన్" అనియుండదగును.

## మధ్యమనడలు - జంపె

సూర్యుడే సుగ్రీవు – సురలెల్ల కపులైరి
ఆ రాఘవుడు విష్ణు – డసురేశ ! వినుము.

సురల మొరాలించి – సురవైరి నిను|దుంప
నరుదెంచినాడయ్యా – ఆరాఘవుండు

మనుజుడని చూడకుము – మహిమీద దనుజులను
దునుమ వచ్చినయట్టి – దుష్టమర్దనుడు.

## వచనము

ఇట్లు బలికి మరిన్నేమను చున్నాడు.

## ఆటతాళం

వినుము రావణ బుద్ధి జెప్పెద – విష్ణుతోడ వైరము
చనదు[1]సతి నొప్పించి రాఘవు[2] – శరణుజొరుము 1

ఆదిలక్ష్మి మహి తనూజని – యాత్మలోన దెలియక
మోదంబున దెచ్చుకొంటివి – మీదుగానక 2

*[పరసతులను గోరి చూచిన – పాపమంద్రు బుధులు
నెరయ రాజసమునకు దూరము – నేర్పుచెడును. 3

1, సీత నొప్పించి—B.

2. శరణు పొందు—C, శరణుగొనుము—B.

*[ ]* ఈ కుండలీకరణాల్లోని భాగం B ప్రతిలో మాత్రమే ఉంది.

రామచంద్రుడు మనుజుడనకు - పురాణపూరుషు డెలియక
దోమలాక్రియ దునుములిడె, ఖర - దూషణులను]*
నాదు విన్నప మాచరింపుము - నాకేశవైరి ! చెప్పితి
లేదు యెవరికి వట్టి వైరము - లెస్స గాదూ.

## ద్విపద

అని బుద్ధిఁజెప్పిన - యా విభీషణుని
వినుత వాక్యంబులు - విన నింపుగాక
కనలి గొబ్బున లేచి - కాలఁ దన్నినను
'అనిలోన రఘురాము - అస్త్రఘట్టనలఁ
బడెదు రావణ ! [1]యేల - పదరక' యనుచు
నడరి విభీషణుం - [2]డవనిపై నొరిగె
*[కన్నుల మిణుగుర్లు - కలయఁగోపించి
తన్నినంతటఁబోక - దర్పించి పలికె]*
'ఓరి ! నాముందర - నోడక నిలచి
సారెసారెకు నాకు - శంకఁబుట్టించి
పగవానిబట్టుగా - పొగడెదు రీతి
పొగడితి విప్పుడు - పొమ్ము ! పోకున్న

1. యెల్లతంగుల యనుచు - T.
2. డుర్విపైనొరిగె - T.
*[ ]* ఈ కుండలీకరణంలోని ద్విపద B ప్రతిలో మాత్రం ఉంది.

తెగవేతు'నని పూను — తెగువాతఁ డెరిఁగి
తగదుండదని వాని — తగురాజ్యలక్ష్మి
† తొలఁగిపోయినరీతి — తొలఁగి విభీషణుఁడు
అలయుచు రఘురాము — నటఁ[1]జేరవచ్చె.

### వచనము

*[ఇవ్విధంబున నలుగురు మంత్రులతోడ విభీషణుండు గగన వీధి కెగసిపోయే లక్షణం బెటువలెనుండెను.

### కందము

దనుజేశుని ప్రాణంబులు
అనిలునివలెఁ బోవునట్టు లా రాఘవుఁడున్
చనుదెంచెననుచు భీతిని
‡ ననఁగ విభీషణుఁడెగసె ఖమధ్యంబునకున్]*

### వచనము

ఇట్లెగసిన విభీషణుండు భయభ్రాంతుడై ఖేచరమధ్యమందు నిలచి, రామచంద్రునిం జూచి యేమనుచున్నాడు.

---

† ఈ పాదంలో గణభంగం గోచరిస్తున్నది.

1. జేరజనియె - A, C.

*[ ]* ఈ గుర్తుల నడిమి వచనం, కందం B ప్రతిలో మాత్రం ఉంది.

‡ ఈ పాదంలో యతిమైత్రి తప్పినది.

## *మధ్యమరేకులు - ఆటతాళం

రావణేశ్వరు తమ్ముడను రఘు - రామ! నీపాదములకు, నే
సేవచేయగ వచ్చినాను - కావవే కరివరదా! 1

కపికులాంబుధిలోన - చంద్రుని కరణినున్న రఘుపతి!
కపటమెంతయు లేక నన్నిటు - కరుణతో నన్నేలుమీ! 2

మత్స్యకూర్మ వరాహ నరమృగ - మాయలను యిటువలె
† అచ్చెరంబుగ దిరుగు రాఘవ! యేల? వామ్మన కేలుమీ. 3

సురలకై బలి[1]నణచి రాజుల - వరుస మును దెగ నరికియు
ధరణి భూసురుల కొసగిన - అభయమియ్యవె నాకునూ. 4

బలిమి బుద్ధియు గలిగిమీరిట - పడుచు బుద్ధుల దిరుగుచు
కలికి కాగల వింతనుండియు - కరుణతో మన్నించుమీ! 5

## ద్విపద

అటుగాన[2] నీచర్య - అజుడైన్న లేడు
నిటలాక్షుడెరుగడు - నీ మహత్త్వంబు.

మునులకైన శ్వేశ! - ముని వేషమునను
వనములో దపసివై - వర్తించు చోట

* B. ప్రతిలో త్రిపుట అని మాత్రమే ఉంది.

† ఆశ్చర్యమునకు 'అచ్చెరము' అను తద్భవము

1. దరిమిరాజాలు—B.

2. నీ మహిమ—A, C.

ఎఱుఁగక రావణుం - డెంత గర్వించి
అరిమురిఁ బర తెంచి - యవనిజఁ దెచ్చి
యసురులు మృతిఁబొందు - యత్నంబుచేసె
† దనుజకులంబు మ - డియు నీచేత
అని మది‡నిశ్చయిం - చాకాశ మెగసి
విడిచివచ్చితి[1] లోక - వీరుని బాసి
*[విడువక పలుమారు - వెలఁది నిమ్మనిన
పదహతిఁ బడఁదన్ని - బట్టణంబునను
కదలక నిలిచిన - ఖండింతుననుచు
తప్పక నాడినఁ - దగవాని విడిచి
చిప్పిల్లు కృపచేతఁ - జెన్నొంది నిన్ను
శరణని వచ్చితి - జానకీరమణ!
కరుణాపయోరాశి! - గాంభీర్యధుర్య!
వేదవేదాంత సం - వేద్య! యభేద్య!
సాదరంబునఁ బ్రోవు - స భయుని నన్ను
రమణీయమూర్తి! సా - ర్వభౌమచక్రవర్తి!
అమరేంద్ర సన్నుత! - అభయ మిమ్మనుచు]*

† ఇక్కడ ఒక పాదము లోపించింది. 'దనుజ కులంబు మడియు నీచేత' అన్న పాదంలో యతి చెల్లడం లేదు.

‡ 'నిశ్చయించి + ఆకాశమెగసి' అని పద విభజనము.

1. లోక కంటకుఁబాసి - B

* [ ]* ఈ కుండలీకరణంలోని ద్విపదలు B ప్రతిలో మాత్రం ఉన్నవి.

శరణన్నఁ గాతువు - స్వామి ! నీ బిరుదు
మఱుఁగుఁ జొచ్చితి నన్ను - మన్నించుమనియె.

## వచనము

అని యిట్లు రఘుపతిని అభయం బడిగిన విభీషణుని వాక్యం బులు విని, డెబ్బదిరెండువేల కపిసేన చూచి, కోపించి, యాకాశంబు జూచినంత నెటువలె నుండెనన.

## నిడుదరేకులు - ఆటతాళం

అసురవాక్యములకు కపు - లాకాశము చూచినంత
పసను దప్పి చుక్కలెల్ల[1] - బయలుప్రాక దొఁణగెన్. 1

ఇనున కపుడు వెచ్చబుట్టి-యిందుకందె, గాలియుడిగె
జనులకెల్ల గానబడక - జాలిపుట్ట దిరిగెను. 2

బెదరి మేఘమండలంబు - పెక్కురూపు లాయె నలగి
యుదధి కడకు బారె, మింట - నురుము లురుమ దొణగె. 3

## ద్విపద

అంతట కపులెల్ల — నందున్న వారు
బంతులవలె గిరుల్ — పట్టుకవచ్చి
ఎగయుఁగా దనుజుపై — వేతమనువారు
ఎగయునేటికి చూడుఁ - డిక్కడనుండి

1. బయలుపార దొఁణగెను—A, C

పడవేతమనువారు — బలిమిమై వాని
పడవేయనేటికిఁ — బదిలంబు గాను

పట్టితె_త్తమనుచుఁ — బలికేటివారు
పట్టి తేనేటికి — పగవారినెల్లఁ

గొట్టంగవలెనని — కోపించువారు
† ..................................

అట్టిట్టు*రవుద్రా — కారభీమణుల
దిట్టలై పోరాడఁ — దివురుచుండగను

## వచనము

అప్పుడా సమయమున నెటువలె నుండెను.

## కందము

దివిసుండి యసుర పలికిన
పవనజుఁడటు చూచి వచ్చి[1]పతి కిట్లనియెన్
అవనీశ ! రావణానుజుఁ
డవు నౌ రఘురామ ! [2] కావ నర్హుండనుచున్.

---

†. ఇక్కడ ఒక పాదము లోపించినట్లు తోచును.

* గణభంగము.

1. యధిపున కవియెన్ — A, C.

2. నర్హుంబగునా — B.

## వచనము

ఇట్లు విన్నవించిన, రామచంద్రుండు ఆర్తత్రాణ పరాయణుండును, [1]శరణాగత వజ్రపంజరుండును గావున తనచెంగట సుగ్రీవునిం గనుంగొని యేమనుచున్నాడు.

## నడలు – ఏకతాళం

ఇనసుత ! వినుమీ – రిందరు జూడగ
ఎనయగ లంకను – ఏలించెద వానిన్ 1

అనిలజ ! యాతని – తోడుక రమ్మన
వనచరపతి (రఘు – పతి) కిట్లనియెన్ 2

ఇచ్చిన దప్పవు – ఇక రావణు డిటు
[2]వచ్చిన, నెటువలె – వరమిచ్చెదవో ? 3

లంక నిచ్చితివి – రావణు ననుజున
కిం కేపట్టణ – మిచ్చెద వతనికి ? 4

## ద్విపద

అని యిట్లు సుగ్రీవుఁ – డాడు వాక్యములు
విని రాఘవుఁడు కపి – విభుఁజూచి పలికె :

---

1. శరణాగత వత్సలుండును గావున—B.
2. వచ్చిన నేమని వివరించెదవో—B.

[1]శరణుఁజొచ్చిన యట్టి – శత్రువుఁగాచి
పరగ నయోధ్యకుఁ – బట్టంబు గట్టి
యెలమితో సేవింతు – నెల్లకాలంబు
తలపోయ నేటికి ? – తప్ప దీ పలుకు.

## వచనము

అని యిట్లు రాఘవేశ్వరుండు ఆనతిచ్చిన సుగ్రీవుం డేమను చున్నాడు.

## కందము

రాజులు మీ రిట్లాడిన
భాజుండన మీకుఁజెప్పఁ ? బగవానునుజున్
[2]బీజ హరింపక [3]మానవ
భోజనుఁ గృపఁజూచు టెట్లు భువి రఘురామా ?

## వచనము

అని సుగ్రీవుండు మఱియేమని విన్నపము చేయుచున్నాడు.

## జంపె

పగ వాని బొడగన్న – డెగజూడవలె (గాక) 1
తెగ గాచుటెట్లయ్య – [4]రఘురామచంద్రా ?

---

1. శరణు వేడిన యట్టి శత్రువుఁగాచి - B;
2. వాఁజ జరించును - C;
3. మానిసి - T;
4. ధరణీశ చంద్ర - B;

ఒకని గాచిన నెటిగి - యొకరొకరె వత్తురిక
యొకమాటమేలయ్య - [1]సకలగుణసాంద్రా ? 2

తగదు యీతనిగావ - మనుజేశ ! వలదనిన
ఇన కులాధిపు డనియె - వనచరేశ్వరుతో 3

## ద్విపద

[2]అన దగదోయన్న ! - [3]అభయ మడిగిన
కనలిచంపుదు నెట్లు - కరుణఁ బోవిడిచి ?

దిక్కునీవని వచ్చు - దీనుఁజేపట్టి
అక్కఱ దీర్చుట - యది పెద్దగాక

మొక్కంగఁ జేతులు - మొదలంటఁబట్టి
ఎక్కడఁ గోయుదు ? - రెరుఁగవా నీతి ?

చంపంగఁ దగునట్టి - శత్రువునైన
తెంపుగాఁ జిక్కిన - తెగఁ జూడవలదు.

ఇంపారఁగాచిన - నిలమీఁద వాని
[4]త్రుంపుట కదియెంత ? - తుద నపకీర్తి !

---

1. అఖిలేశ ! మీకు - A; C;
2. అనఁదగునాయన్న—B; C,
3. అభయమిమ్మనిన—B,
4. త్రుంపుట గాదువో తుదిభానుతనయ !—A,C.

[1]కడుపు కొంటకు మహా - కానలలోన
ఎడపక గింజలు - ఏరుక తినెకు
పక్షులు సహితము - పగవానిఁగాచె.
రక్షింతునే వాని - రప్పించుమనిన

## వచనము

ఆ మాటకు సుగ్రీవుండేమని విన్నపము చేయుచున్నాడు.

## కందము

విపినము లోపలఁ దిరిగెడు
కపులము, చపలాత్మకులము, కరుణానిధి ! యే
నపరాధి, నెఱుఁగ; నెటువలె
నుపకారముచేసెఁ[2]బక్షు లుర్వీనాథా !

## వచనము

అని సుగ్రీవుండు ముకుళిత హస్తుండై, యా పుణ్యకథ యెఱుంగింపుమని, రామచంద్రునితో మఱిన్నేమనుచున్నాడు.

## రేకులు - ఆటతాళం

ఖగములకు పగ గలిగెనెటువలె ? - కానలోన పగతుడు
నొగిలె నెటువలె గాచె పక్షులు ? - తగవు మెఱయా 1

1. కడుచిత్రమౌ మహాగహనంబులోన—B,
2. లోక యెఱుకనకున్?—B,

ఆనతిమ్మని భానునందను - డడుగగా, రాముడీ కథ
వీనులకు విననింపుగా - వినుపింప దొడగెన్. 2

మేరు దక్షిణ తీరమున నొక - మేటియడవి లోపల
సారమగు పరిపక్వఫలములు - చాలగలవు 3

పక్షిజాతులు బహు మృగంబులు - పన్నగాదులు ధరగల
వృక్షజాతులు గలవు ఆవన - వీధులయందు. 4

చిత్త మొక్కటిజేసి హరిపై - చింత నిలిపే
యుత్తమంబగు మునివరుల కక్కడ - యునికిపట్టు. 5

వచనము

అట్టి తపోవన భూమి మఱియెట్లువలె నుండెను.

మధ్యమరేకులు - జంపె

[1]మందారములు మంచి - చందనంబుల మీద
[2]సందడిగ బారు గురు - విందతీగలును 1
[3]క్రేంకణంబులు మంచి - శాకభ్రమాకుల మీద
[4]వీకతో బారు క - న్నాకు తీగెలును 2

1. మకరంద చందనముల మీద—B,
2. అందముగ—B, T,
3. కేంకణంబుల—A,
4. వీకగా బారిన యాకు తీగెలను—A,C,

**కపోత వాక్యము**

మల్లెలును మొల్లలును – మంచి విరజాజులును
ఉల్లి బిళ్లైపారు – నెల్ల చోటులను
కురువేరు దవనంబు – కుసుమగంధములు
స్థిరముగా నేప్రొద్దు – తిరుగాడుచుండు.
కర్మంబు లెడలించు – కమలాకరములందు
నిర్మలంబై యుండు – [1]నీరుకందువులు.

## ద్విపద

ఏనును లక్ష్మణుం – డెలమి తోడుతను
జానకియును గూడి – చనిచని యంత
అక్కడి కేగితి – మావనం బెల్ల
ఎక్కడ పొడఁగాన – మెన్నఁగా వినము
అఱువది యోజనా – లష్టదిక్కులును
[2]కరువలిదూరని – కారాకువనము
అందున్న మునులు మ – మ్మతి భక్తిఁ జేసి
విందు గావించి యా – వృత్తాంత మెల్ల
చెప్పిరి పక్షులు – [3]చరియించు చోటు
ఒప్పుగాఁ జూచితి – మొక విచిత్రంబు.

---

1. నీటికంబములును — B.
2. చాఱఁబాఱి కరువలి సుడియంగ రాదు — B.
3. చెలువంపు చోటు — B. T.

అట్టి యా ఘనగాత్ర - మా బ్రహ్మ తొల్లి
ఎట్లు నిర్మించెనో - యెఱుఁగ మెక్కడను

ఒక్కొక్క శాఖ పెం - పున నజుండైన
లెక్క చేసెదమన్న - లెక్కింపరాదు

ఊడలు పదివేలు - నుర్విపై బలిసి
యాడఁ జూచిన మొద - లెఱుఁగ రాకుండు

పిక్కటిల్లఁగఁ బండి - పికములకెల్ల
దిక్కైన యామఱ్ఱి - [1]దివి మోచి యుండె.

## వచనము

మఱిన్ని ఆ మఱ్ఱి వృక్షంబు యెటువలె నుండెను.

## *అటతాళం

హరికి తల్పంబయె నా మఱ్ఱి - యాకు తొల్లి, మునులు
సురలు జూడగ వత్తురందుల - [2]చోద్యమరయ. 1

నాగకన్యలు నమరకన్యల - నాడఁ బిలువ బోదురు
బాగుగా నా మఱ్ఱియూడలు - పట్టుకొనుచున్. 2

---

1. దిగమోచియుండె - A.

* 'త్రిపుట' అని B. ప్రతి.

2. ముదముగాన - A. C.

గ్రహణ కాలమునాడు చంద్రుని - గఱువ రాహువు
[1]అహరహము లా మఱ్ఱికొమ్మల - [2]సణగి యుండును. 3

మాగి యెండల మఱ్ఱియాకులు - మబ్బుకొనగా బోనటు
బాగుగాదని యినుడు దక్షిణ - భాగ మఱుగున్. 4

మూడులోకములందు వారికి - మూలమైన మార్గము
యూడజెప్పగరాదు అందుల - జాడలెల్ల. 5

## ద్విపద

అచ్చోటఁ జరియించు - నా కపోతములు
మచ్చికతో నాలు - మగఁడును గూడి
కొఱుకులు మేయుచు - కోరి వేడుకల
సురత బంధంబుల - సుఖియింపఁ దలఁచి
కోరి యా కొమ్మల - గూడొప్ప బెట్టి
చేరియుండెను రెండు - చెలఁగి వేడుకల.

## కందము

పక్షులు పాప విమోక్షులు
పక్షులు [3]చరియించు నందు బహుళముగా, నా
పక్షులు ఉండెడు వృక్షము
ఆ క్షణమునఁ జూచె నెఱుకు అగచరనాథా!

---

1. యిరవై సహజముగ - A, C.
2. చాటునుండు - A, C.
3. హరిఁజూచు నెడను పక్షులు విసుమా : - A, C.

## వచనము

[1]ఈ క్రమాన పక్షుల జూచిన యెఱుకు ఎటువంటి వాడు.

## రేకులు - అటతాళం

వాని కెటువలె[2] బ్రహ్మ నొసలను - వ్రాసినాడో ? వణకుచు
గూని వీపును, కురుచ చేతులు - గునుకు నడుపూ. 1

తొట్టినోరును [3]తుట్టెపెదవులు - బుఱ్ఱముక్కు, వానికి
వెఱ్ఱిచూపును, గుడ్లు అతనికి - వెలికి నుఱుకున్. 2

తుప్పతలయును, దొప్ప చెవులును - దూడకడుపు వానికి
చెప్పరాదు మేని కంపటు - చేరరాదూ. 3

కందెన మసికల్పి పూసిన - కాంతివాడు, ఎపుడు
పందివలె బలిసుండు - పక్షులపట్టి మెసగీ. 4

చాల జీవుల జంపబుట్టిన - జడునిరూపు, జూచిన
కాలకింకరు కై వడిని మడి - కానవచ్చూ 5

## ద్విపద

అలాగు వాఁడంత - [4]నాయడవిలోనఁ
గాలీచఁబోఁదిర్గి - ఘనమైన మఱ్ఱి

1. మరియు నామఱ్ఱి వృక్షంబు చూడవచ్చిన యెఱుకు వాని చక్కదనం బెటువలె నుండెను - B.
2. బ్రహ్మమూలై వ్రాపెనో వణకుచు - A.
3. తొట్టిపెదవుల - A.
4. నా యరణ్యములోన—B.

దవ్వుల పొడఁగని - దగ్గర వచ్చి
గువ్వలు మెలఁగెడు - గూడు వీక్షించి

*[కలిగెబోనందున - కలిగెడు పనికి
బలువగు పక్షులు - బహు విధంబులను

ఇంత కాలంబాయె - నీ మట్టి యెఱుఁగఁ
బంతముతో వీటిఁ - బట్టెద ననుచు

గంతులు వేయుచు - కాలు దువ్వుచును

.... .... .... .... .... .... .... ....

చెంగు చెంగున దాఁటి - సాము సేయుచును,
పొంగుచు మీసముల్ - పొసఁగ దువ్వుచును]*

ఇక్కువఁ జూచియు - నిఁకనాకు నవియు
దక్కఁగాకని యెక్క - తలయెత్తి చూచి

పొద్దులే దురులొడ్డి - పోవలె నేడు
వద్దని వాడంత - వైళంబె కదిలి

పోయి నంతటిలోన - ప్రొద్దును గూకె
ఆయెడ సంధ్యావే - ళాయె నంతటను.

---

*[ ]* ఈ కుండలీకరణాలలోని ద్విపదలు A ప్రతిలో మాత్రమే ఉన్నాయి.

## వచనము

అప్పుడు సూర్యాస్తమానమైన లక్షణం బెటువలె నుండెను.

## ఆటతాళం

రక్కసుల దునుమాడి హరిజల - రాశి గడుగ దెచ్చిన
[1]చిక్క చక్రము రీతి భానుడు పశ్చిమ - జలధిగ్రుంకెన్. 1

చేరె పక్షులు, ఫణులు తమ తమ - [2]చేరికలకు పొందుగ
జారచోరులు మెచ్చ చీకటి - చాల బర్వెన్ 2

చీకటను రక్కసుల మీదకి - సిరివరుండు శరముల
తాకనేసిన రీతి దివ్వెలు - తరచు మెఱసెన్ 3

నీలి పసుపులమీద ముత్యపు - ప్రాలురాశి దీర్చిన
లీల చుక్కలలోన చంద్రుడు - చాల నొప్పెన్ 4

మరుడు విరహుల మీద జల్లిన - మందు భూతి యనగను
వెరవునను వెన్నెలలు గాసెను - [3]విరివిగానూ. 5

## వచనము

ఇవ్విధంబున చంద్రోదయంబైన చంద్రుని జూచి స్త్రీలు విరహ తాపంబున ఏమనుచున్నారు.

---

1. చక్రమోయన యినుడు—B.
2. యిరవులకు—A, C
3. తరచుగానూ—B,

## విరాళి పదాలు – ఆటతాళం

నొసలి కంటి మీది వెన్నెల! కాక - నుసలక వచ్చేవు వెన్నెల!
మసలుచు తిరిగేవు, మామీద కోపించి-మలయ నేటికోయి వెన్నెల! 1

విషపు కోరలవాడు వెన్నెల! [1]నీవు - మసలిన బోసీక వెన్నెల!
కసిగాచి నీమేను కబళించు, నటువలె - కాయనేటికి వెన్నెల! 2

[2]హెచ్చి తిరిగేవోయి వెన్నెల! నిన్ను-ఏమన గల మోయి వెన్నెల!
మచ్చరమున మా కప్పర చెన్నుని-[3]మహిమ లరసి కాయు వెన్నెల! 3

జారవిద్యల వాడ వెన్నెల! గురుని - సతికి నాశపడ్డ వెన్నెల!
ఘోరమైన యీ దోషము నీ యందు-దొరలియుండునోయి! వెన్నెల! 4

వేడై కాయుకే వెన్నెల! [4]పాలా వెల్లి మీగడముద్ద వెన్నెల!
ఆడు వారి నింత అలయించగా నిన్ను-అవునందు రటవోయి! వెన్నెల! 5

నేరక తిరిగేవు వెన్నెల! నిన్ను — నెలకొక్క— పారోయి వెన్నెల!
పారజూచినను పాపములు [5]బాయును,—పడుదువు తిట్టైన వెన్నెల! 6

జాణలెల్ల గూడి వెన్నెల! నీవు - చల్లాని వాడని వెన్నెల!
నా కౌమయిన నీ రాకగోరు వలి -నాత్ముల బ్రోవు వెన్నెల! 7

---

1. నిన్ను - నెలకొక్క— పారోయి వెన్నెల!—B.
2. ఎచ్చరించేవోయి! వెన్నెల! - A, C.
3. మహిమతో కాయూవోయి వెన్నెల! - B.
4. పాల వెన్నెలు గరిగేవు వెన్నెల! - A, C.
5. దాయును - A.

విరహుల బొడగన్న వెన్నెల! [1]చాల - వెగ్గలైన తోచేవు వెన్నెల!
కరుణ లేక మీ కళలందు జూడగ - శరములై తోచును వెన్నెల! 8

మరుని బలముల గూడి వెన్నెల! నీవు -[2] మామీద దండెత్తి వెన్నెల!
పరువులు బారేవు బయలు మెరసి, నీకు-పగవారమటవోయి! వెన్నెల!9

మా తోడబుట్టిన వెన్నెల! లోక - మామవు గదవోయి! వెన్నెల!
ఈ తారతమ్యము యెఱుగక తిట్టితి-మా తప్పు గావుమీ వెన్నెల! 10

నీతితోడ మమ్ము వెన్నెల! కప్పర -[3]నిలయము డేలెనోయి! వెన్నెల!
[4]భాతిగల నామబలభద్ర కృపగల్గి-[5]ప్రబలి కాయుమవోయి! వెన్నెల! 11

## వచనము

అప్పుడు మఱివెన్నెటువలె నుండెను.

## ఆటతాళం

ఒల్లిదవు రతికేళి పణతుల - పట్టి పెనగి పురుషులు
అల్లి బిల్లైపోయి రంతట - నలసినిద్ర

తారలును శశియుడిగె, జారుల - తమకముడిగె; శుక్రుడు
తేరుకొన నుదయించె, తూర్పున - తెల్లవారెన్.

1. నీవు వైరివై తోచేవు - A, C.
2. మామీద కోపించి - A, C.
3. నిలయుడు యేతెంచె - A.
4. భ్రాంతిగల్గి యీము - A, C.
5. పఱిగి - B.

కలువలును ముకుళించె, తామర సుమ - ములు విరిసె; చయ్యన
సలినముల చెలికాడు తూర్పున - నగము[1] ప్రాకెన్ 3

## ద్విపద

అంతకంటెను మున్ను - నాయెక్కు లేచి
జంతువుల వధింప - సంభ్రమంబుగను
దంతివలె నున్నట్టి - తన సతి లేపె
.... .... .... .... .... .... .... .... .... .... ....
అంతట గొణుఁగుచు - నావులింపుచును
నంతరక్కసివలె - నాయింతి లేచె
మాలమూల్గులు మూల్గి - మగనిఁ దిట్టుచును
.... .... .... .... .... .... .... .... .... .... ....
మెల్లన లేచియా - యోగుల ముండ
జొల్లు సెలవుల వెంట - జొట జొటఁగార
పేలు రాలెడి తల - పెడతల కణితి
వ్రేలాడు చెవులును - వెళుపాటి ముఖము
వ్రాలిన చన్నులు - వార చూపులును
[2]నాలుగు చేతులై - నాతికి నమరు
తులువ చేతులు జూచి - తుప్పున నూచి
వెలికురికెడు పండ్లు - పెటపెట గొరికి

1. దాకెన్ — B, క్రుంకెన్ — T.
2. నాలుక చేతులై — B.

*[నిదురఁబోనీయవు – నీ బూడిదెత్త!

పదరక నేటితో – పోపొమ్మటంచు]*

పుల్లల నెగఁదోచి – బుస్సున నూది

మల్లలో నొకకొంత – మాడిన కూడు

వేసి కుండెడుపోసి – వెలిచామగంజి

బోసినవాఁడంత – బోలెడు కూడు

బోసిన యటుఁదాగి – బుస్సంచు లేచి

గోచి నెంగిలి రుద్ది – గొబ్బున మొలను

కాసెగా నొక గుడ్డ – కట్టుక మరియు

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

చిక్కంబు గట్టుక – జిగిజంపు వెదురు

ఱెక్కల పచ్చని – రెమ్మల తడక

[1]పురిగల యీకలు – నూటితాళ్ళురులు

ఒరపైన గుముడుక – లోక కొన్నివలలు

జిగురు గండెలు మఱి–చిన్నని యురులు

తగినవన్నియుఁ గొంచు – తమకంబుతోడ

దండ కడ్యంబులు – తలయుర్లుబూని

బండివలె నన్నియు – బరివోసి కొనుచు

---

*[ ]* ఈ కుండలీకరణాల్లోని ద్విపద – B ప్రతిలో మాత్రం ఉంది

1. పురగల వీకలు పూరతాళ్ళురులు – A. C.

ఖగములు ఉన్నయా - కందువ పోలము
తెగువతోఁ గదిలె నీ - తెరువున వేట

## వచనము

ఈ క్రమాన యెఱుకు వేటలాడే లక్షణం బెటువలె నుండెను.

## కళికెలు - ఏకతాళం

[1]డొంకపుటురు లటు - పొంకము సేయుచు
టెంకుల కొయ్యన - [2]క్రొంకి లాగుచును. 1

పండిన తరువుల - కండెలొడ్డుచును
కొండ బిలంబుల - [3]దండిగ జాపుచు 2

చాలగ వలలటు - చక్కగ నొడ్డుచు
మూలనున్నశశ - ముల దోలుచును. 3

మేసేటి పక్షుల - మెడ నురి దగిలించి
[4]తీసితీసి మొల తిత్తిన - వేయుచు. 4

[5]నెరవుగ నిరవుల - నీరుకందువల
తిరుగాడుచు నా - దిక్కున వచ్చెన్ 5

---

1. డొంకల - T.
2. స్రుక్కిసువాడున్ - B.
3. దండింపుచును - B.
4. దీపి విరచి చిక్కముల బెట్టుచును - A, C.
5. నెరయగ - B.

## వచనము

ఈ క్రమాన వేటలాడుచు వచ్చిన యెఱుకువానిని గనుగొని యా మఱ్ఱి వృక్షంబున నున్న పక్షులు [1]యెగసిపోయే లక్షణం బెటువలె నుండెను.

## కందము

చండాలుఁ జూచి చెంతను
నుండక యటు దవ్వుఁబోవు నుత్తముల క్రియన్
మెండైన యెఱుకుఁ గనుఁగొని
అండజములు ఎగసి పోయె [2]నాకసమునకున్.

## జంపె - మధ్యమతాళం

అంతచెప్పులు విడిచి యాతడురిగోల - తరుపొంత జేర్చి
చెంతను నటులుంచి తా - చెట్టు నెగ బాకె నాజడు డంతలోన 1
[3]వటమెక్కి యాగూటి - వాత నురులొడ్డి
తటుకునను నొకవంక [4]నటుదాగి తానుండె యెఱుకు 2
విడిచి చిక్కము తాడు - వివరమున బంధించి
తడికె క్రిందను బెట్టి - తామసుండంత. 3

---

1. పారిపోయ్యే లక్షణంబు - A, C.
2. నతిదూరమునన్ - A, C.
3. పొంకముతో నురులు తా వింకమున బంధించి - A, C.
4. పొంచి తా జూచుచుండెన్ - C.

## ద్విపద

అటుబోయి పక్షులు - ఆహారకాంక్ష
ఇటు నటు దిరుగాడి - యిరవైనచోట
వరిగెలు, కొఱ్ఱలు - వరి నీరుచామ
[1]గురుగులు, రాగులు - గునుకు వడిపిళ్ళు
ఆళ్ళు జొన్నలు మఱి - యాడకాడకును
[2]పోళ్ళలో రాసులు - పోసిన రీతి
రాలియుండఁగఁ జూచి - రమణియు దాను
[3]వాలి జోడుగ గూడి - వలయు ధాన్యములు
[4]ఆకలిగొని పక్షు - [5]లనుభవింపుచును
వీకతోనుండఁగ - విధివశంబునను
పొడఁగనె నొక డేగ - పొదవున నుండి
యొడిసిన నొడిదప్పి - యొకటొక[6]టెగసి
పొరలుచు పాలికె - పొదలటు దూరి
కారాకులను జొచ్చి - కదలక యణగి

---

1. గురుగు వరిగెలు నూర్పిళ్ళసాగి—A, C.
2. పోళ్ళలో గుప్పలు—A.
3. వ్రాలిన తమకములు—A; C.
4. ఆకలిదీరఁగ—T.
5. నపహరింపుచును—A, C.
6. బాపి—B.

పతిఁ బ్రాసి యిట్లుండఁ - బణఁతి శంకించి
అతిభీతిఁ బొందెనా - యాఁడు కపోతి

మానుగ వణఁకుచు - మందిరంబునకు
జానొప్పఁ జనుదెంచి - చయ్యనఁ జొచ్చి

అక్కటా ! ననుఁ బాసి - యీ యడవిలోన
ఎక్కడ వేగింతు - ఏమందు విధిని ?

అని యని పలుమాఱు - నాత్మలోఁదలచి
అనువంద మింటికి - నెగిరెనో యనుచు
మనసున [1]బెగడొంది - మందిరంబునకు
చనుదెంచి యాఁగూఁడు - చయ్యనఁ జొచ్చి
కడుపాప కర్ముండు - గట్టినయురులఁ
బడి పొరలాడుచుఁ - బణఁతి యిట్లనియె.

## వచనము

అప్పుడు ఉరులలో బడిన ఆడుకపోతంబు తన పెనిమిటిని దలంచి ప్రలాపించే లక్షణం బెటువలెను.

## *రేకులు - ఆటతాళం

స్వామి ! నీపాదముల ముందర - చావు లేక, నేనిటు
తామసుని భయదంపుటురులలో - దగులు వడితిన్ 1

1. గరుగుచు - B.

* 'త్రిపుట' - అని B ప్రతిలో ఉంది.

నాకు, నీకును ప్రాణమొక్కటి – నాథ ! నను బాసితి
[1]ఏకమున నీవెట్లు బ్రతికెద ? – వేమిసేతున్ ? 2

కటకటా ! యిట్లేల వచ్చెతి ? - గాక యిటుల కాక
ఎటులమాను నీ తొలి కర్మం - బిటుల నుండెన్. 3

పతియు నిహాపర సాధనము సరసస – ద్గతినూత గాకిటు
పతికి దుఃఖము గలిగె నాయెడ – పాపమందెన్. 4

## ద్విపద

అని యీ క్రమంబున - నా ఖగకాంత
తనపతి గుణములు - తలఁచి యిట్లనియె :
పరసతిఁ గూడవు – పరనింద సేయ
పరయంగ కల్ల నీ – యాత్మలో లేదు
నిర్మలాత్మకుఁడవు - నీతిమంతుఁడవు
కర్మంబులెన్నడు - గానవు నీవు
ఒంటి నీయడవిలో – నొక్కింత ప్రొద్దు
గెంటక యెటువలె - గేహంబులోను
ఉండెదవని నాకు - హృదయంబు లోన
మండఁగఁ గానల - మఱిఁగెదఁ గాని
నా కూర్మిదైవమా ! - నా ప్రాణనాథ !
నా కల్ప భూజమా ! - నా తోడునీడ !

1. యేక్రమంబున నడలెదొ నేనేమిసేతు – A, C.

ఒంటిగా నడవిలో – నుండునా యనుచు
ఇంటికి వచ్చితి – నే నిన్నుఁ బాసి

ఎచ్చట ప్రాణంబు – లెడబాయఁజేసి
అచ్చట నెడఁబాపె – నట్టి దైవంబు

చాపుకు వెరవను – స్వామి నీపాద
సేవ లేదని చింత – చేసెదగాని

అతిదుఃఖమున నిట్లు – అడలుచున్నంత
పతివ్రతార్థంబులు – పచరింపఁ దొణఁగె

## వచనము

ఈ క్రమాన ఆగుకపోతి యేమనుచున్నది,

## *ఆటతాళం

అతివ కేటికి నోము ? తీర్థము – లాడగాను యెందుకు !
పతివ్రతానకు సాటిలేదని – వలుకు శ్రుతులు 1

మతిగలిగి తన మనసు పెనిమిటి –మనసు ఒకటై తిరిగెడు
అతివలకు హరిపురి నివా – సంబంద్రు బుధులు 2

మొగడు తిట్టిన మొగము ముడువక – మొదటి [1]భక్తి విడువక
తగవుతో చరియింప వలె బో – తరుణులకును. 3

* 'త్రిపుటతాళం'—అని B. ప్రతిలో ఉంది.

1. మగని భక్తి—B.

**కపోత వాక్యము**

పతివ్రత ధర్మంబుజేరి - పంతమాడి దైవమా!
మతమునను నెడబాపె [1]నిటువలె - మాయచేసి

పతిని బాసిన [2]దోషమున నే - పట్టుబడితి నిచ్చట
గతియు నాకిక [3]నేది యని - ఖగకాంత పలికెన్.

ద్విపద

అని యీ క్రమంబున - నడలు చున్నంత
మనసున దయలేక - మఱుఁగున నున్న

ఎఱుక గ్రక్కున లేచి - యెగిరి భవబంధ
మరుదుగాఁ దెంచిన - ట్లా యురి దెంచి

పరమపదం బెక్క - పక్షి పట్టఁగను
నరుగుదు నన్నక్రియ - నతిముదంబునను

పట్టి గ్రక్కున నెఱ్క - పరమ మునీంద్రు
గట్టిగ హరిపదము - గని పట్టినట్లు

భవములు దెగఁగోయు - బాగుగ నెఱుక
వివరించి గురుయుర్లు - విడిపించు విహగ

---

1. నేనేమి సేతున్ - B.

2. దోషమిదిగో పట్టుబడితి నిచ్చట - A, C

3. యేదదని - B.

K 3

మొఱయంగ బిగువుగా - [1]నొకచేతఁ బట్టి
మఱల ఱెక్కలు విర్చి - మట్టి దిగి పచ్చి
చిక్కంబులోఁ బెట్టి - చిక్కెనని యెలుక
అక్కడ ఘోషించె - నాకాశవాణి
పరమ పతివ్రతఁ - బట్టిన యెలుకఁ
దరలి పోనియమని - తలఁచె మేఘంబు
ఉఱుములు నుఱుముచు - నుర్వెల్ల నిండి
గుఱుతుగా వర్షంబు - కురువంగఁ దొణఁగె.

## వచనము

ఈ క్రమాన యెలుకవాని నరికట్టుకొని వర్షంబుగురిసె; నప్పుడెటువలె నుండెను.

## *త్రిపుట

[2]ఖగము బట్టిన సురలు రాళ్ళను - కణగి రువ్వినలీల నప్పుడు
[3]గగన పథమున నుండి వడ - గండ్ల వాన కురిసెన్ 1

---

1. విగ్గర – A, C

* 'ఆటతాళం'—అని A, C ప్రతులలో ఉంది.

2. ఖగముబట్టగ దివిజులు - కంటగించి రాళ్ళను - A, C.
3. తగులనేసిన రీతి వడగండ్ల - A, C.

వచ్చె నెటువలె పక్షి కీ దెస - వగ నటంచును భూసతి
వెచ్చనూర్చిన రీతి భువి నా - విఱ్ఱ[1]విరిసెన్ 2

అంతకంతకు నగ్గలంబై - యవనిమీద వర్షము
ముంతబోసిన రీతి కురిసెను - [2]కొంత తడవు 3

వాన గురియుగ గాలి విసరగ - వణకు బుట్టి, యెటుకటు
మానువలె బడియుండె నా - మర్రి క్రింద 4

గుంత మిట్టనక వరదలు - కుంభిణందు బారగ
వింతవాగై తోచెనంతట - వెలిసె వాన 5

## ద్విపద

అంతట దాఁగిన - యా కపోతకుఁడు
ఇంతిని [3]మదినెంచి - [4]యీ వానచేత

ఎంత భీతిల్లెనో - యెఱుఁగరాదనుచు
చింతించి యెలుఁగెత్తి - చీకుచుఁ దిరిగి

[5]అంతంత నిలిచి ప - ల్కాల కింపుచును
సంతాప మందుచుఁ - జని, గిరి పొదల

1. వెడలెన్ - B.
2. అంతతడవు - A.
3. దలఁపోసి - A, C.
4. యిట వానదడిసి - A.
5. అంతట - B

వెదకుచు వేగంబె – విడిది కేతెంచి
చెదరిన తన గూడు – [1]చెచ్చెరఁ జూచి
కలఁగి నివ్వెఱఁగంది – కన్నీరు నించి
తలపోసి మదిలోన – తగ విచారించి
ఇంతకు నింటిలో – నింతి యుండినను
ఎంత దవ్వేదురుగా – నేతెంచు నాకు
అరిగెనో హరిపురి – కటుగాన నేఁడు
మఱుఁగున నున్నదో – మగువ ననుఁబాసి
కరుగులపైఁగల – ఘనమైన భక్తి
మఱచెనో నామీఁది – మమతలటంచు
సంతాప మందుచు – చాల దుఃఖించి
రంతుగా నేడ్చె నా – రమణి లేకున్న

## వచనము

అవని నప్పుడు కపోతకుండు తన యింతి లేని గృహము యొక్క శూన్య లక్షణం బెటువలె వర్ణింపుచున్నాడు.

## అనువులు – జంపె

పతిలేని ధాత్రియును – సతిలేని రాత్రియును
మతిలేని మంత్రియును – సుతిలేని తంత్రి 1

1, చందంబుఁ జూచి - A, C.

కవిగాని వ్రాతయును - చవిగాని మేతయును
దివెలేని గృహము [1]బు - ద్ధియు లేనిచదువు 2
అన్నంబు లేనోడలు - [2]సున్నమందని విడెము
చన్నుగవ లేని పణతి - అన్యాయ సుఖము 3

## వచనము

మఱిన్నమను చున్నాడు.

## ఆటతాళం

సవరదనము లేని వేశ్యయు - సానక్రింది వన్నెయు
రవియులేని పగలు - రసికులులేని రచ్చ 1

కనలి యేనుగు జొచ్చి కలచిన - కలువకొలను
మనసు రంజిల్లనట్టి - మాటలు మ్రాని నిద్ర 2

[3] వేసరిక నడవులను నొంటిగ - వేయు గృహము
గ్రాసమీయని రాజుకొలువు - కష్టుని కలిమిచెలిమి 3

దానధర్మములేని జీవుడు - దయయులేని తపమును
చేను వెన్నులులేని చెలువము - చెడుగు నడక. 4

---

1. పొందికలేని చదువు - A.
2. సున్నమిడని విడెము - .T
3. కానలోపల అవులను సమకట్టు గృహము - A.

## ద్విపద

ఇటువలెనున్నది - యింతిలే నిల్లు
కటకటా! యనుచు గ - ద్గద కంఠుఁడగుచుఁ

దలపోసి వెఱఁగంది - తన మదిఁగుంది
పలుమాఱుఁ బుడమిపైఁ - బడి పొరలాడి

కొమ్మకొమ్మకు నెగసి - గొబ్బున మఱలి
క్రమ్మఱఁ దనగూడు - కడనుండి చూచి

మగువ గుణంబులు - మాటి మాటికిని
పొగడుచు మదిలోనఁ - బొగులుచుఁ బలికె:

'ఏమని తిట్టిన - నెడయక నెపుడు
కోమలి! నాయెడ - కోపంబు లేదు

నీవంటి గుణవతి - నీవంటిప్రియను
నీవంటి జవరాలి - నే నెందుఁగాన

ఇతరుల కీగుణం - బెఱుగంగ రాదు
మతిమంతురాలవు - మగువలలోన

అతివరో! నీవంటి - అనుకూలవతిని
ఈ తరుణులలోన - నెందును గాన

నా కూర్మివయ్యారి! - నన్నెడఁబాసి
ఏ కాననంబున - కేగెనో గాక

ఎచ్చట వెదకుదు ? — నెచ్చటఁగందు ?
ఎచ్చోటఁ బొడచూతు — నింక నీ రూపు ?
[1]అని విలపించుచు — నా యింతి గుణము
మనసులో తలపోసి — మఱియు నిట్లనియె.

## *మధ్యమరేకులు — జంపె

మతి చెప్పునెడ మంత్రి — మన్నించునెడ ధాత్రి
రతి సల్పునెడ రంభ — [2]రసికత మెఱయన్ 1
గతికి సోపానంబు — కరమొప్పగా నరసి
సతతమును రక్షించు — నిజమాతవలెను 2
పతిభక్తి తోడుతను — పని సేయునెడ దాసి
అతివ విలసిల్లు నీ — యాఱు గుణములను 3
ఇట్టి సద్గుణశాలి — యిట్టి నాప్రియురాలి
నెట్టు లెడబాపెనో ? — యేమందు విధిని ? 4
పతిభక్తి దలచి యిటు — పలుమాఱు వగవంగ
కలకలను బలికె నా — కాంత పురుషునితో. 5

---

1. అని ప్రలాపించుచు — B.
* మధ్యమనడలు — అని 'T' ప్రతిలో ఉంది.
2. రమణీయమైన — B.

## ద్విపద

'ఓ నాథ ! ఉన్నాను - ఒక యెఱుక చేత
నా నోము ఫలమున - [1]నలిన గర్భుండు
నిన్నెడఁబాపి యీ - నీచు కొప్పించె
ఇన్నన్ని విధముల - [2]నేల యేడ్చెదవు ?

[3]బలుజీవులను నెల్ల - బంధజీవులము(ను ?)
నలవడఁజేసినాఁ - డాహారముగను

చావు పుట్టువు రెండు - సర్వేశ్వరుండు
గావించినాఁడిట - కపట నాటకము

సుఖము, దుఃఖంబును - శుభము? నశుభము
[4]నిఖిల లోకేశుండు - నిర్మించినాఁడు

అటుగానఁ బ్రాణంబు - లవియు నిత్యంబు
పటుబుద్ధి తప్పక - పాపాత్ముఁడెఱుకు

పటమూలమునఁ బడి - వణఁకుచున్నాఁడు
కటకటా ! వీనినిఁ - గావరాదనక

---

1. నన్నింతజేసె—A, C.
2. నేలశోకింప ?—A, C.
3. బలుపిడి పక్షుల—B.
4. సకలాత్ముఁడింతయు సమకట్టినాడు—A.

తటుకున అనలంబు - తగఁదెచ్చి నీవు
కుటిలమెంచక నీవు — కృపఁజూడు మనియె

## కందము

తనయింతి [1]పలుకు మాటలు
వినియును ఖగరాజు మనసు విరవిరఁబోవన్
ఘనమైన శోక[2]వార్ధిని
మునుఁగుచు ధరమీాద వ్రాలి [3]మూర్ఛ నణంగెన్.

## వచనము

[4]ఇట్లు పుడమింబడి, బంతి చందమున పొడవుగా నెగసి, మూర్ఛిల్లి తెలిసి వాలుగొమ్మల సందుగాను తనవనితా రత్నంబుం గను గొని యేమనుచున్నాడు.

## త్రిపుట

మగువరో నిను జంప బట్టిన — మనుజు గావ నే నిక
పగకు బంధుడగాను [5]నీ విటు - పలుకదగున ? 1

1. యాడుమాటలు—A.
2. వహ్నిని—B.
3. ముద్దయామునిగెన్—A.
4. ఇవ్విధంబున కపోతకుండు మూర్ఛిల్లి తెలిసి, వాలుగొమ్మలయందు వ్రాలి తన ప్రాణసఖితో యేమనుచున్నది—B.
5. నన్నిటు—A, C.

జగడమైనను మేలుసుమ్మి స - జ్జనులతోడి నెప్పుడు
తగదు క్రూరునితోడి పొందిటు - తరుణి వినవె! 2

పరులును గిరు లేదు - వార్ధులును దాల్చెదను
భారమగు పాపాత్ము మోయనని - పలుకు ధరణి. 3

వచనము

మఱింకెటువలె నుండెను.

ద్వపద

అటుగాక పీనిపై - [1]అడలెట్లు బుట్టె ?
అటు దయమాలిన - [2]న్నగ్ని దెమ్మనిన

నినుఁబట్టి కట్టిన - నీచునిఁగావ
[3]మనసెట్లు బుట్టెనో - మగువరో! నీకు ?

ఏనాటి చుట్టంబె - ఎఱుకు నీ కెట్లు ?
[4]వినుము ఈ పనికైన - విషము భక్షించి

చనుదెంతు నీ వెంట - సందేహమేల ?
చనెదము హరిపురి - చక్కికి నేఁడు

అనఁ దన పతితోడ - నాయింతి పలికె :

1, నెవరెట్లు A, C
2. అనలంబు దెమ్మంటె - A, C
3. మనసు చూడగనేల - A.
4. వినిపిస్తి దంబైన - B.

## కందము

తెగియాడనేల ఖగపతి ?
పగవాఁ డిటు వినుము నీదు పాదములాసన్
నొగిలిన యెఱుకను గాచిన
నగుచును హరిపురికిఁ [1]బోవ ననువై యుండున్

## వచనము

అని యిట్లు ఖగకాంత తన పురుషునితో నేమనుచున్నది

## *ఆటతాళం

వారిజాసను డిట్లు నొసలను - వ్రాసినాడు; [2]మనకిటు
[3]ఘోర పడగనేల నాథ! నీమది - కోపముడుగు 1
చంపనోపవు యెఱుకువాని – చలముతోడ, చిక్కము
చింపనోపవు, నన్ను వెలిగా – వింపలేవు 2
అధములము మన మవనిలోపల – అల్పతనము, మొదటనే
పొదివినట్టి యాపదల కేటికి – పొక్కవలదు; ఇటువలె 3

---

1. నవ్వింతచేసె - A, C
* 'త్రిపుట'—అని B ప్రతిలో ఉంది.
2. దీనికి—B.
3. ఘోరమగు నోనాథ నీమది కోపముడుగు—A.

[1]తొల్లి జేసిన కర్మశేషము - తోడ రాకేలమనుచును ? ఇటువలె
వల్లభుడ ! విధిచేత జిక్కిన - వారి వినవా ? 4

హరుడప్పుడు కోపమున - అజుని శిరము తరిగెను
పరగ శశి యుష్ణాంశులను - ఫణిభంగ పరచెన్ 5

వెదకి కృష్ణు డొక్కబోయచే - వేటుబడియె; ఇంద్రుడు
పదవి హీనత కొంతకాలం - బొదిగియుండె 6

ఎన్నగల దేవతల కిటువలె - నెగ్గుగలిగెన్, ముందర
ఉన్నవారము ఎంత మాకని - [2]యుండవశమా ? 7

ఆసపడి ఈయెఱుకు మన - వాసరమునకు వచ్చిటు
గాసిపడియున్నాడు వీని - కరుణజూడు 8

## వచనము

అనిన విని యా కపోతకుండు ఏమనుచున్నాడు.

## ద్విపద

తన్నుమాలినయట్టి - [3]ధర్మమెచ్చటను ?
అన్నమాటలు నిజ - మాయెగా తరుణి !

---

1. ఎల్లలోకములందు మునుపటి వారి వినవా ? యిటువలె—B
2. ఉండవలదు—T.
3, ధర్మమది పరుల - A, C

వసుధలో నెవ్వరు – [1]వర్ధిల్లరనుచు
విషపు విత్తులుదెచ్చి - వి త్తుదు రటవె ?
[2]అల బర్బరములకు – నరఁటులు గొట్టి
వెలుగుఁ బెట్టిన యట్టి – [3]వెఱ్ఱి చందమున
నెలమితో మేలు నే - నెట్టుల జేతు ?
[4]బలు జీవములు గొన్న – పాపకర్మునకు
హరిహరి ! యని పల్కి యటు – మూర్ఛవోయి
వరధైర్యమున నంత - వేగంబె లేచి
కొంత మోమటు చూచి – కన్నీరు నించి
ఇంతి నాదెసఁ జూడు - మించుక తడవు
అనియని కనుఁగొని – అతివరో ! వీని
నెనరొప్పఁగా బూనిఁ – నేఁ గావ ననిన

## వచనము

అని తన పతి పలికిన అవ్వానితారతమ్యంబు ప్రాణవల్లభుతోడ ఘనమైన నీతి మార్గము వినుమని ఖగకాంతతో నపుడిట్లనియెను.

---

1. వర్ధిల్లు మనుమ – B
2. అరయగా బబ్బిళ్ళ కరఁటులు గొట్టి – A, C
3. వెఱ్ఱులు గలర ? – A, C
4. బలుజీవ హంతకు – A,

## *రేకులు - అటతాళం

ధర్మమే తనతోడు నీడని – ధరణిలోన చదువులు
నిర్మలంబుగ చాటుచుండగ – నీతి వినవా ? 1

నరికి, గానుగలోన వేసిటు – నలియనాడి వండిన
చెరుకు [1]తీపెరుగవా ? అందుల – చేదు గలదా ? 2

పరులకొరకై కురియువానలు - పారునదులు; ఎవ్వడు
పరులకొరకై పిదుకు గోవులు - పండు ధరణి 3

మేలు కీడును ఒక్క కొలదిని – మెలగునట్టి పురుషుడు
కాలునకు నగపడక శ్రీహరి – కడకుబోవున్ 4

ఎఱుకమాలిన యెఱుకువాడు – ఎంత కీడు చేసిన
పరమధర్ములు నొచ్చి – పలుకుట పాడిగాదు. 5

## వచనము

మఱెన్నెమను చున్నది.

## ద్విపద

అటుగాన నుపకార – [2]మన్నిలోకములఁ
బటుకీర్తనంబులఁ - బరఁగుచునుండు

* త్రిపుట - అని B ప్రతిలో ఉంది.
1. తీపేగాక — A, C.
2. సత్కీర్తి—B.

**కపోత వాక్యము**

మోసపోవక కీర్తి - మునుఁ జరియించు
వాసిగాఁ జెప్పెద - వారలవినుము.

ఇలలోనఁ దన కీర్తి - నిరవుగాఁజేసి
బలియుండె హరిపాద - పద్మంబుక్రింద

సరవి తోడుత హరి - శ్చంద్రుఁడనురాజు
పరఁగ బ్రాహ్మణుచేత - బంధింపఁబడియె.

అజుఁడును తన కీర్తి - నఖిల లోకముల
భజనతో చదువులు - పాటించి నిలిపె

ఫాలనేత్రుని కీర్తి - ప్రబలె లోకముల
కాలకూటము తన - కంఠాన నిలుప

వసుధలోఁ గీర్తికై - వనజోదరుండు
[1]పొసఁగుచు బలుమారు - పుట్టుచు నుండె.

ఎన్నాళ్ళు అపకీర్తి - ఎవ్వరందుండు
అన్నాళ్ళు వాడుండు - నధమలోకమున.

తగ దెగ్గులెన్నంగఁ - దడవాయె యెఱుకు
తెగిన మీఁదట అగ్ని - తేనేల? యనుచు

నగుబాటుసేయకు - నన్ను మన్నించి
[2]ఖగరాజ! వీనినిఁ - గావుమటన్న.

---

1. పొసగఁ బదిరూపులై - పుట్టుచుండె—A, C.
2. ఈ యెరుకునుగావు - మిపుడనిమ్రొక్కె—A, C.

## కందము

ఖగరాజు ఇంతి పలుకులు
[1]తగఁ బ్రియమున నాదరించి తాత్పర్యముతో
మొగిలంట నెగసి [2]తన సతిఁ
బోగలకు మనిపోయి కొఱవి బోరునఁ దెచ్చెన్.

## మధ్యమరేకులు జంపె

ఆయన కుల సతి మాట – ఆత్మలో [3]చింతించి
దయతోడ కొఱవెలుకు – దండ నటుబెట్టి 1
[4]ఉరవని పొదరిండ్ల – నున్న చిదుగులు దెచ్చి
తరచుగా కారాకు – తల్పంబు [5]చేసెన్ 2
పొంకంబుతో నోర – పొసగించి అందులో
జింక పెంటుకలు దెచ్చి – చిద కొర్వివేసెన్ 3
కసువు పుడకలు వేసి – కట్టెలొవ్వాగ బేర్చి
విసరె రెక్కగాలి – విలసిల్లగాను 4
రాలున్న కారాకు – రాసులొయ్యన నంటి
గాలి వీవగ[6]మంట – ఘనముగా మండెన్ 5

1. యోగికుఁడు యోగమంత్ర మొగి విన్నట్లున్ - T
2. నాసతి—A, C.
3. భావించి—A, C.
4. కురియవి పొదలయందున్న—B.
5. వేసెన్—B.
6. అగ్నిగనగన మండెన్—A, C

తీరె చలి యెఱుకునకు – దిమ్మదిరిగటు లేచి
సారెసారెకు నొడలు – చలి దీఱ గాచెన్ 6

కాకబుట్టిన యొడలు – గావగ సెగబుట్టి
ఆకలనియెడు తెగులు – అధికముగ నాయెన్. 7

## ద్విపద

ఈ క్రమంబున యెఱ్ఱు – హిమమెల్లఁ బాసి
ఆకఁటిచే నొచ్చి – యధిక దాహమున
వీక్షించి యప్పుడా – [1]విహగేంద్రు కనియె :
'పక్షివల్లభ ! నాకుఁ – బ్రాణ మిచ్చితివి
అశనంబులేక నే – నరుగను పురికి
దశచెడి యున్నాను – దాతవు నీవు
కావవలె'నని నోరఁ – గసవును గఱచె.
[2]భావజ్ఞుఁడా పక్షి – భావంబునందు

## వచనము

అప్పుడా ఖగరాజు తన మనస్సున నేమనుచున్నాడు.

---

1. విహగంబుఁ జూచి—A, C.
2. భావజ్ఞదయతోడఁ బలికె నాపక్షి—A, C.

## * అటతాళం

అశన మిమ్మని అడిగె నెఱుకిటు - అడవిలోన జిక్కెను
వశముగా దే వంక దెత్తును - వనజనాభా ! 1

అశనమిమ్మని యడిగి నపుడే - ఆదరించి కావని
గ్రాసమియ్యగ లేని - [1]కష్టుని కాయమేల ? 2

కావదగు శక్తుండు [2]దీనుల - కావడేని, వాడిల
చావకుండిన నేమి, యెక్కడ - చచ్చె నేమి ? 3

భయపడుచు వడి నీట బోవంగ - పట్టవలయు గాకిటు
బయట నుండినవాని - బట్టుట పాడిగాదు 4

పట్టదగువిత మప్పుడే తనచే - పట్టి పిదప వదలక
గట్టిగా చేపట్టవలె - తుదముట్టు దనుక. 5

## ద్విపద

అని యీ క్రమంబున - నడిగిన యెఱుక
మనసులోపల నున్న - మంట చల్లార్ప
వెరవేది యని మహా - వేదనం గుంది
[3]పరమపుణ్యుడు ఖగ - పతి విచారించి

---

* 'త్రిపుట'—అని B. T, ప్రతులలో ఉంది.

1. కష్టపు—A,
2. నిధముల—A, C.
3. పరిపరి ఖగసతి—పతి విచారించి—B.

అడుగుట కష్టంబు – అటుదన్నుఁజేరి
[1]అడిగి లేదనుటంత – కంటె కష్టంబు
అటుగాన నింతికై – యధిక దుఃఖమున
ఎటువలె నోపునో – యెఱుఁగ మీాప్రాణి
*[ చేకూరె నేఁడు నేఁ – జేసిన మేలు !
ఈకాంత జూడంగ – నిది లెస్స యనుచు ]*
చేసిన మేలెల్లఁ – జెడిపోక యుండ
గ్రాసమిచ్చెద నాదు – కాయ మీా పనికి
జరమరణాదులఁ – [2]జెడిపోవకుండ
ఎఱుకన కీ దేహ – మిచ్చెద ననుచు

## వచనము

అని యీా క్రమాన వచ్చిన కపోతకుండు శ్రీహరిఁ దలంచు మని తన మనస్సునకు యేమని బుద్ధి జెప్పుచున్నాడు.

## వరాళిపదము

ఆయువు నిత్యంబని నీ వెప్పుడు – కాయము నమ్మకు జన్మమా !
మాయల బ్రతుకని మనమున నెంచి – సేయవె దానము జన్మమా ! 1

---

1. కడిమి—B.
*[ ]* ఈకుండలీకరణాల్లోని ద్విపద T ప్రతిలో మాత్రమే ఉంది.
2. జెడివగ్గనేల ?—A, C.

తలకకు నెవ్వారి జన్మమా! హరి - దలచి మెలగు జన్మమా!
[1]కలిమని పొంగకు; కలిమి చాలదని - [2]యెద్దెస బోవకు జన్మమా! 2

అద్దపునీడని, హరినెపుడు నీ - బుద్ధిలో దలచవే జన్మమా!
.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... 3

సాయుజ్యమునకు సోపానంబని - సేయవె చెప్పెద జన్మమా!
కాయజ [3]గురుడగు కప్పరచెన్నుని - పాయక దలచవె జన్మమా! 4

## ద్విపద

అని యప్పు డెఱుకతో - నా పక్షిపలికె :
'వినవయ్య! యెఱుక! నా - విన్నపమెల్ల

అడవిలో రాలున్న - యట్టిధాన్యంబు
ఎడపక కలపాటి - నేఱుక తినుచు

గాదెలు [4]గరిసెలు - కడుపులెగాని
[5]లేదు దాపుర మొక్క - లేశమాత్రంబు

ఆకలి దీఱంగ - నగ్నిలోఁబడెద
వీకతోడుత నన్ను - విఱిచి భక్షించు

1. కద్దని పీగకు—B.
2. వద్దని వగవకు జన్మమా—B.
3. గురుడగు కప్పర విలయుని—A.
4. గుమ్ములు—T.
5. లేదు పాయంబింత—T.

అని తన మనసులో - నయిదు భూతముల
ఘనముగాఁ గణములు - గట్టి బంధించి
మనసులో హరి నిల్పి - [1]మదినోడు మఱచి
కనలెడు నగ్నిలో - గ్రక్కునఁ బడియె.

## *నడలు - ఏకతాళం

అంతట నారదు డా - వృత్తాంతము
వింతగ హరితో - వినిపించుటయు 1
కంతుజనకు డటు - [2]గరుడుని ఎక్కెను
సంతసమున తన - సతులును గొలువగ 2
కమల సంభవుడు - గంధర్వాదులు
అమర వల్లభుడు - ఆదిగ సురులును 3
[3]అరుదుగ పదుగురు - ఆళువారలును
పరమ వైష్ణవులు - భక్తిని గొలువగ 4
తుంబురు నారదు - డాదిగ పాడన్
అంబరమున రం - భాదులు నాడన్. 5

---

1. మఱియొండు మరచి—B.
* గరళలు—అని A, C ప్రతులలో ఉంది.
2. గరుడుడు మ్రొక్కంగ—B.
3. ఈడులేక పన్నిద్ద రాళ్వ వారలను—T.

కోకలు దారలు – పెద్ద [1]బూరుగలు
[2]బారకొమ్ములును – బోరున మొఱసెన్ 6

జలసిరువంకల – పరమ వైష్ణవులు
గోలుపంగ గదిలెను – కుంభిని విభుడు. 7

## ద్విపద

ఆశ్రమంబున విష్ణు – డఖిల దేవతలు
మూఁకతో దివి నుండి – మూఁగి చూడఁగను

[3]అనలంబుఁ జొచ్చిన – యా కపోతకునిఁ
గనుఁగొని ఖగ కాంత – కడుమూర్ఛ నొంది

[4]తెలిసి, తన మేనెల్ల – తెరలంగ నపుడు
వలలోననుండి యా – వనజాక్షి పలికె :

'నామాట దోయవు – నా ప్రాణనాథ!
భూమిలో నీ కీర్తి – భువనంబు లెఱుఁగు

స్వామి! యీ యెఱుకకై – సమసితి విపుడు
ఏమని దుఃఖింతు ? – ఏమిసేయుదును ?

ఎన్నినీతులు చెప్పి – యే నిన్నుఁ జంపి
పన్నుగా వగచిన – పరులు నవ్వెదరు

1. కాకులును —T.
2. బూరుగ గొమ్ములు—B.
3. అనలంబులోఁ బడ్డ—B.
4. తెలిసిమెల్లగఁ దెరలగా నెఱుక—T.

నాకుఁ బ్రాణములిచ్చి - నాఁడవు నీవు
నీకుఁ బ్రాణంబులు - నేనిత్తుననుచు

అనినప్పు డెఱుకుతో - నతిప్రియం బొదవ
'వినవయ్య! యెఱుక! నా - విన్నపం బొకటి

ఒకట నాకలి దీఱ - [1]దొగిరెంటఁగాని
అకట! నా పతివెంట - నరుగంగ వలయు

మన్నించి నన్ను నీ - మంటలో వైచి
తిన్న నాఁకలిదీఱు - దిగ్గున లెమ్ము

అనిన పీనులు మూసి - యప్పుడా యెఱుక
కనలు శోకంబుతో - ఖగకాంత కనియె :

## మధ్యమనడలు - జంపె

'అతివ! నీపతి నన్ను - బ్రతికించి విడవ
మృతుడయ్యె నాకిట్టి - బ్రతుకు మఱియేల? 1

అతిపాప మతిని స - ద్గతి లేనివాడ
పతినుండి బాపితిని - సతిని నిను నేడు 2

భక్షించ నేనొల్ల - పణతి నిను విడచెదను
పక్షికులమున గలసి - [2]బ్రతుకవోయమ్మా!' 3

---

1. ఒనరంగ నేడు—T.
2. చేరిబ్రతుకు మాయమ్మ!—A, C

అనుచు చిక్కము జించి - యందున్న పక్షులను
చనుమంచు విడిచె నా - జడుడంతలోన 4

పోయి పక్షులు [1]చెదరి - పొదరిండ్ల లోదూరె
అయింతి నిలిచె తా - [2]అనలంబు కెదురు. 5

## ద్విపద

నిలిచిన నాయెఱుక - నివ్వెఱగంది
అలయుచు లేచె నా - యగ్నికడ్డంబు

నిలచి ఖగకాంతతో - నెఱయ నిట్లనియె :
'వలదు పోవోయమ్మ ! - వగవ కోయమ్మ !

కలదు నాయెడ తప్పు - కల్ల చేసితిని
తలపోయ నాతల్లి - దండ్రులు మీరు

అలసినే నొకమాట - అడిగినంతటనె
బలువేగమునఁ జచ్చెఁ - బణఁతిరో నీవు

చావకపోవమ్మ ! - లేకున్న నీవు
చచ్చిన చోట నేఁ - జత్తు నటంచు

అచ్చెలిఁ గనుఁగొని - ఆ యెఱుకవలికె.

---

1. యెగసి — B.
2. అనలము నెదుట — A, C.

## వచనము

ఆ మాటకు ఖగకాంత యెక్కుతో నేమనుచున్నది.

## ఆటతాళం

అనఘ ! నీ కులకాయుంబిది — అడలనేల యిపుడు ?
కలిగ నేని చేత హరికి - కల్లగాదు 1

తప్పు నీయెడలేదు నా ఓ ! - తండ్రి ! వినుమ పెసిమిటి
తప్పినా యెడ స్త్రీల కుండుట - తగవు కాదు. 2

అన్నదమ్ములు సుతుల — తండ్రుల నైనగాని పొడగని
వన్నెగలవారైన స్త్రీలకు - వలచు మనసు 3

కన్నశిశువులు తల్లికడుపై ఉన్న - కాంత దక్కను
ఉన్నసతులకు నుండగా దగ - దుర్విలోన 4

గ్రాసమొల్లక నాకుసలములు — మేసి యడవుల వెంట దిరిగెడు
మాసకమ్మల నైన మదనుడు - [1]మరులు గొలుపున్ 5

కరకకాయలు నమలి మొల నొక - కావిముంజె గట్టిన
పరమ సన్యాసులను - మదనుడు భంగపరచున్ 6

మాయదారి మదను చేతను - మలసి మోసపోవక
పాయకను పతివెంట బోయిన - ఫలము గలదు. 7

---

1. భంగపరుచున్ — B.

### వచనము

అని మఱిన్నేమనుచున్నది.

### మధ్యమకళికెలు - జంపె

గుడ్డైన కుఱుచైన, గూనైన - కుంటైన కుష్ఠైనగాని
ఎడ్డైవాడ్డైయేమి - యెఱుగకుండినను
తగునాకు దైవమని - తలపోసి మనసులో
మగనిపై భక్తివలె - మగువలకు నెపుడు

పతికి బెట్టక మునుపె - పణతారగించెనా!
గతిలేని గ్రామ సూ - కరము గాగలదు.

వెక్కసంబున పతికి - [1]వెరపకెదురాడెనా!
మొక్కలపు కుక్కయై - మొఱుగుచు నుండున్.

పతిభక్తిలేక - [2]పరభక్తి గలిగుండెనా!
అతివ గార్దభముగా - [3]అవనిపై దిరుగాడు

[4]పతితోడ జన వెరచి - ప్రాణమాసించెనా!
గతిలేని భూతమై - కాటిలో దిరుగు.

---

1. నెదురు భాషించెనా! — B.
2. పరభక్తితో నుండెనా! — T.
3. అవనిపై బుట్టు — A, C.
4. పతివెంట — A.

ఎగ్గులను ఎటువంటి - ఎన్నిపాపములైన
అగ్నిలోపల [1]బాయు - నన్నిదోషములును 7

## ద్విపద

అనినవ్వఁ డెఱుకువాఁ - డజ్ఞాన ముడిగి
తన మదిలోపలఁ - దగ విచారించి
'కర్మంబులన్నియుఁ - గాలిన మేను
నిర్మలంబై యుండు - నిజము నీమాట.
ఎనయ నేఁ జేసిన - యెల్ల పాపములు
అనలంబులోఁ [2]జొచ్చి - యణఁగింతు నిపుడు'
అని నిశ్చయము చేసి - యప్పుడా యెఱుకు
మనసు లోపల నొక్క - మాట చింతించి
కరములు ముకుళించి - కాంతకు మ్రొక్కి
పరువడి వినయ సం - భరితుఁడై పలికె :
'పతితోడఁ జచ్చిన - ఫలమేమి గలదు ?
అతివ నాకీ తెఱం - గాన తి మ్మ'నిన

## అర్ధ చంద్రికలు

'వినవయ్య యెఱుకు ! ఇది - వివరంబుగాను
మనసరయ నీ కొక్క - మాట చెప్పెదను

1. బడిన నన్నియును దొలగున్ —B.
2. బడి —, B

**కపోత వాక్యము**

పతిలేని సతికి స - ద్గతి లేదు గాన

విదితమై కళ్యాణ - వేదిపై నుండు

పొంకముగ బ్రహ్మముడి - పొయ్యెడి కొఱకు

కంకణము గట్టుటది -కడు బాయు కొఱకు

ద్విపద

సేసఁబ్రాలొక రొకరి — చేతులఁ బోసి

బాస చేయుట గాదె — పతికిని సతికి

పతిఁబాసి యుండుట - పాప హేతువయు

గతిమాలి బ్రదుకుట — కారణం బేమి ?

అగ్నిముఖమునఁ బాయు - నన్ని కర్మములు

అగ్నిలోఁ బడఁగ న - వశ్యమింతులకు

జంపె

పతికి పగరంబైన - పడె నగ్నిలోపలను

మతి దలంచగ చంద్ర - మతి కీర్తిమించెన్.

పతిగోరి అగ్నిలో - బడి వేదవతి కన్నె

అతిపుణ్య సీతయై - ఆ రాము గలిసెన్

పతిఁబాసి గుల్లచ - న్నంబై (శ్రీ) గౌరి

గతి బొందియుట కట - కంతు గలసెన్

వచనము

మఱి న్నేమనుచున్నది.

## కందము

పతిపాప కర్ముఁడైనను
నతివేడుకతోడ నింతి యనలముఁ జొరఁగా
పతి పాపమెల్లఁ బాయును
గతిగలదని పలుక నెఱుకు గ్రక్కునఁ దొలఁగెన్.

## రగళలు – ఏకతాళం

అంతట ఖగసతి – అనువుగ జలముల
సంతోషంబున – స్నానము చేసెన్ 1

పంతము లాడుచు – పర తేరగ గని
రంతుగ పక్షులు – రవములు చేసెన్ 2

ఖగపతి చావుకు – తెగువ నిక్కమని
పొగులుచు నలము – భగభగ మండెన్ 3

మండెడు మంటలు – మగువ గనుంగొని
అండగానకచనె – నతి వేగమునన్ 4

[1]తరులును విరుగగ – గిరులును గూలగ
కరువలి క్రిందను – పరువులు బారెన్ 5

హరినారాయణ ! – హరినారాయణ ! యని
[2]తిరిగి, నభమునకు – దిగ్గున నెగసెన్ 6

---

1. తరులును గిరులును – గిరగిర దిరిగెడు—B
2. ప్రదక్షిణము తిరిగిన భయమున దిగ్గున నెగసెన్—B.

పాపములన్నియు - బాఁగుగ నిట నెడ
బాపుమనుచు - మఱి ప్రస్తుతి చేయన్.

## ద్విపద

[1]అప్పుడు వెఱఁగంది - యా యెఱుకవాఁడు
తప్పక వీక్షించి - తనుకాంక్ష విడిచి
అజ్ఞాన మనియెడు - నంధకారమున
సుజ్ఞాన దీపంబు - చూపిన కరణి
భవబంధములు - బాయ భావంబులోన
భువన రక్షకుఁడన - బుద్ధిలో నిలిపి

## వచనము

అప్పు డా యెఱుకువాడు తన మనస్సునను శ్రీ[illegible]
కొని యేమనుచున్నాడు :

## *ఏకతాళం - నడలు

అంతయెఱుకు తన - ఆత్మను గలిగిన
చింతలు బాయను - శ్రీహరిందలచెన్
గ్రక్కున యమకిం - కరులకు నియ్యకు
దిక్కిక నీవని - గ్రక్కున మ్రొక్కెన్.

1. అప్పుడు నాశ్చర్య - మందుచు నెఱుక—B.

* A, C. ప్రతులలో 'గరళలు' అని మాత్రం ఉంది,

ఎడసేయఁగదగు - యముని కింకరులు
అడుగు నిడగరా - దని భయపడుచున్ 3
తోడు కానవడి - దొడ్డవాని వెనుక
గూడ బాలుక్రియ - గొబ్బున బడియెన్. 4

## ద్విపద

[1]అప్పుడు దేవత - లాకాశవీధి
[2]నుప్పతిల్లఁగ మది - నుత్సాహ మెసఁగ
అప్పుడు మేఘంబు - లడరి ఘోషించె
గుప్పెఁ బువ్వులవాన - కుంభిని మీఁద
విరుల వానలు కడు - విస్మయంబుగను
కురియించి రంతట - కుంభిని మీఁద
అప్పు డానందించె - నన్ని లోకములు
ఉప్పరం బెగయుచు - [3]నుప్పొంగె ధరణి
అప్పుడా శ్రీహరి - యాశ్చర్య మంది
రప్పింప వలెనన్న - రాజీవనయను
కడకంటఁ జిలికెడు - కరుణామృతంబు
పొడగని సురపతి - పొంగుచు మ్రొక్కి

1. అప్పుడు దివిఁజూచి - అఖిల దేవతలు—B,
అప్పుడు దేవత - లాహాయనంగ—T.
2. కప్పెలోకంబెల్లఁ — గలవరం బెసఁగ—T,
ఉప్పొంగి ఘనముగా - నుఱుములతోడ—A, C.
3 నుర్వి గంపించె—A, C.

సకలద్దైవ మునీంద్ర - సంఘంబు గొలువ
అకలంక చిత్తుడై - యచ్చోటు బాసి
యొప్పైన పుష్పకం - బొకటి దెప్పించి
అప్పుడు భువికేగ - నమర వల్లభుడు.

## వచనము

ఈ క్రమాన నింద్రాది దేవతలు చనుదెంచి, ఆ యెఱుకను జూచే సమయంబున నెటువలె నుండెను.

## జంపె - నడలు

అంతపక్షులు మొఱ్ఱ - నగ్నిలోపల నుండి
వింతగా కర్మంబు - విడిచి పోయినను 1

కసటు గలసిన పసిడి - కాక చేతను గ్రాగి
మిసిమి మెఱుగులు దేర - మించినటువలెను 2

పస మీఱి దీప్తులై - ప్రబలి చెన్నొందుచును
ఒసపరై నుండంగ - నొగిజేర వచ్చెన్. 3

అక్షులను కృపమీఱ - అమృతాశ్రు లొలుకగా
పక్షులను జూచె నా - పాకశాసనుడు. 4

[2]అంత గంధర్వాదు - లందముగ బాడగ
నంత నప్సరస్త్రీలు - నందంద నాడ 5

1. సకల సన్మౌని గణము గొలువ—A.
2. వింతగా గంధర్వ వెలదులు బాడ—B.

అంత సుర దుందుభులు - నందంద మ్రోయ
నంతటను మునిసంఘ - మందఱును తీర్చన్ 6
అంతపక్షుల నెఱుఁగు - నమర పుష్పకముపై
సంతోషమున గొనుచు - చనిరి [1]దేవతలు 7

## వచనము

అప్పుడు మఱి న్నె క్రమంబున నుంటెను.

## ద్విపద

అంతట యమునేశ - [2]యక్షంబు వచ్చి
పంతంబులాడుచు - [3]పట్టుక నెఱుకఁ
[4]గొనిపోవు చుండంగ - కోపించి సురలు
క్షనలు శరంబుల - ఘన గదా చక్ర
పరశుపట్టిస శూల - [5]భద్రాయుధములఁ
గురియించి యార్చుచుఁ - గూడ నే తెంచి
నెట్టనఁ దాఁకిన - నెఱయఁ గోపించి
కట్టల్కతో నుత - కొలుని సేన

---

1. వేగమునన్ — B.
2. యపురులఁ గోలి — B.
3. పట్టుకవేగ — T. పట్టిరా యెఱుక — A.
4. గొనిపోవసిపున్న — B.
5. బహువిధాస్త్రములు — A. C.

యట్టహాసముచేసి - యమరుల మీఁద
దట్టంపుటలుఁగులు - [1]దళ్ళుగా గురియ

[2]వానకాలంబైన - వరుసఁ జూపఱకుఁ
గానవచ్చినసేన - కరటి మేఘములు

ఝళిపించు రాహుతుల్ - ఛాయఖడ్గములు
తళుకులు మెఱుపులు - తగ గుణధ్వనులు

నుఱుములు శరములు - నుద్ధతి దాక
తొరఁగు రక్తంబులు - తోయముల్, మేను

పదునుగాఁ దునియలై - పడిన మాంసములు
పొది నింద్ర గోపంబు - పురువులుగాఁగ

వానకాలము రీతి - వరుస బాణములు
గొనకొని వర్షంబుఁ - గురియించి మించి

మునుగఁబట్టిన తెవుల్ - ముండను బట్టి
మనునీతి యెఱుక క - ర్మావలిఁగూడి

ఇరువంక సేనలు - ఇట్లు పోరాడి
హారిదూత లప్పుడు - నడ్డంబువచ్చి

విఱిఁగి పారఁగఁదోలి - విడిపించి రెఱుక
సురలు గొనిపోయిరి - సొబఁగుమీఱఁగను.

---

1. తఱచుగా వేయ—A, C.
2. వానకాలము రీతి—A.

## వచనము

ఈ క్రమాన దేవతలు సంతోషచిత్తులై హరి సంకీర్తనలు యీక్రమాన పాడుచున్నారు.

## జాళపదాలు

గజరాజ వరద! ఓ – భుజగాద్రిశయన!
గజముఖాశ్రిత శేష! – త్రిజగవందితుడ! 1

దిధిమి ధిమికిటతో – ధిమికి శ్రీహరి
శ్రీ శేషాద్రీశ! దివిజ – వందితుడ! 2

భవములన్నియు బాయు - పరగ నీ స్తుతిచేత
భువనరక్షక! మోహన! క – వ్వర భువనేశ! 3

## ద్విపద

ఈ క్రమంబున నపు – డింద్రాదిసురలు
చక్రినిఁ బాడుచుఁ – జెలఁగి యాడుచును
ఆకసంబున నున్న - హరి సమ్ముఖమున
మూఁకలై చనుఁదెంచి - మ్రొక్కుచును
అప్పుడు హర్షించి – యఖిలేశుఁ డెలమి
ఇంపుగాఁజూపిన – విశ్వరూపంబు

పక్షుల కెఱుఁకుకుఁ - బరమపదంబు
ఆక్షణంబున నిచ్చి - యరిగె నా స్వామి
అదిగాన యీ కథ - యగచరేశ్వరుఁడు
చదివిన, ముదముతోఁ - జదువంగ విన్న
కోటి తీర్థములాడి - కోటి బ్రాహ్మలకు
కోటి సువర్ణముల్ - కోటి గోవులను
ధార వోసినయట్టి - ధర్మంబుగలదు
చేరు పుణ్యంబులు - చెడుఁ బాతకములు
అని రాఘవుండిట్లు - ఆనతిచ్చినను
విని కపులందఱు - విస్మయంబంది
గంతులు వేయుచుఁ - గదిసి మ్రొక్కుచును
సంతోషమున రాము - సన్నిధి నిలిచి
అప్పు డేర్పరచిన - యీ కథామృతము
ఎప్పుడుఁ జదువుచు - నెల్ల వానరులు
హనుమంతుతోఁ గూడి - యీ విభీషణునిఁ
గొనివచ్చి రాముని - కొలువులోపలికి

వచనము

అని యీ క్రమంబున అవ్విభీషణుని కపులు తోడుక వచ్చినపుడు, ఆతడు రామచంద్రునికి దండప్రణామంబు సమర్పించి, ముకుళిత హస్తుడై మఱిన్నేమని విన్నపము చేయుచున్నాడు.

## వరాళి – కాంభోది

కందర్పజనకుడ ! – కమలజ జనక !
ఇందిరా రమణుడ ! – యిల భార హరుఁడ ! ||పల్లవి||

సింధుశయన ! హరి ! - శ్రితభయహరణ !
మంధర ధరణ ! ఓ – మధుసూదనుండ ! ||కందర్ప|| 1

అందరాని లోకమందె – మీ పాదార
విందము శరణు గోవింద ! - ఫణిపతిశయన ! ||కందర్ప|| 2

[1]ఫణిరిపువాహన ! ఫణిభూషణనుత ! పావనుడ !
ఫణిముని గణనుత ! ఫణిబలహరణ ! ఫణినామాంకిత !
పావనుడ ! ||కందర్ప|| 3

జలజోదర ! హరి ! దుగ్ధ - జలనిధిశయన !
జలజభవనుత! - జలనిధిబంధన! జలజాక్షా! ||కందర్ప|| 4

కలిగితి ననుకృప - కావగ ధరలో
నిలిచితివి కప్పర - నిలయుడవై. ||కందర్ప|| 5

## వచనము

అని యీ క్రమంబున స్తోత్రముచేసి విభీషణుండు రామచంద్రునకు దండ ప్రణామంబు సమర్పించి, ముకుళిత హస్తుండై మఱిన్నేమని విన్నపము చేయుచున్నాడు.

---

1. ఫణివిషాంకుర భవభంజనుండ—A, C.

## ఆటతాళం – రేకులు

జలుకుడిగి విభీషణుడు రామ - చంద్రు ముఖము వేడుక
[1]కళలకును వికసించు కలువల - కరణి జూచెన్. 1

సాధులను రక్షింప, దుష్టుల – సంహరింప బుట్టిన
వేదగోచర! నిన్ను జేరితి – వెఱవ నేను. 2

ఆదినారాయణుడ! నీచే - హతమగును దనుజుండు
పాడు చేసెను, వొండు చేసిన - వాడుగాడు. 3

మును సనత్కుమారుని చేతను - మూలమెల్లా దెలిసిటు
నిన్ను గలియను సీత దెచ్చెను - నిఖిలమెఱుగ. 4

నీతి కాదనుచు నే బుద్ధిజెప్పిన - కాలదన్నె; రావణు
బాధలన్నియు బాపి ధరణి - బరువు[illegible]డింపు.

## ద్విపద

అనిన సంతోషించి – యారామ విభుడు
వనధి బంధించి, రా – వణు సంహరించి

అనిమిషాదులు పొగడ – నా విభీషణుని
ఇనకు లేశుడు లంక – [2]నేలంగ బనిచి

తన దేవితోఁగూడ – దశరథాత్మజుడు
ఎనయ పుష్పక మెక్కి – యెల్ల వానరులు

---

1. కలువలు వికసించు కైవడి చూచెన్—A, C.
2. యిరవొంద విచ్చి—T.

తనుఁజేరి కొలువంగఁ - దన పురంబునకు
మనుజేశుఁ డేతెంచె - మహిమతోడుతను.

## వచనము

ఇట్లు రామచంద్రుండు తన పట్టణప్రవేశమైనప్పుడు పురసతులు సంతోష చిత్తులై యేమని పాడుచున్నారు.

## *విరాళిపదం

సువ్వి సువ్వీలమ్మ - సువ్వీసువ్వాలని
శుభముగను భూ - వల్లభు బాడెద రో లాలా ! ॥వల్లవి॥

గుచ్చిన ముత్యపు - కుందెనలోపల
అచ్చుగ కుంకుమ - లమరించి
పచ్చలు దాపిన - పసిడిరోకటను
మెచ్చుగ దంపెద - రోలాల ! ॥సువ్వి॥ 1

జంగలు జాపుచు - జాఱిన పయ్యెద
రంగుగ చెక్కుచు - నలరుచును
చెంగలింపుచును - చెలియలు వేడుక
పొంగుచు దంచెద - రోలాల ! ॥సువ్వి॥ 2

మెఱుగు కమ్మలటు - మెఱయగ [1]జెక్కుల
తురిమిన పువ్వులు - దూలగను

---

* 'T' ప్రతిలో 'పాడిన వర్ణం' అని ఉంది.
1. చెంపల—T.

కరకంకణములు - గతులకు గదలగ
వరుసను దంపుదు - రో లాల ! ||సువ్వి|| 3

తాపిన నీలపు - తళుకులు బొదలగ
మూపున కొప్పును - మెఱయగను

పాపటబొట్టూ - పాలిండ్ల దరగ
ఏపున దంచెద - రోలాల ! ||సువ్వి|| 4

## * కందము

కడలేని కర్మవారిధి
కడవెళ్లఁగ నీద లేక కళవెళపడుచున్
పొడఁగంటి నిన్నుఁ గన్నుల
కడఁగంటను కరుణఁజూడు కప్పరనిలయా !

## † ద్విపద

అని యీ కథాస్థితి - నఖిల లోకముల
వినుతికెక్కిన జగ - ద్విఖ్యాతు పేరఁ
[1]బదిరూపులై పుట్టి - పద్నాల్గు లోకముల
[2]విదితుఁ ‡దయ్యేను - జగద్విఖ్యాతు పేర

* ఈ కందము తంజావూరి ప్రతి (T) లో మాత్రం ఉంది.
† 'T' ప్రతిలో 'మధ్యమనడలు' అని ఉంది.
1. పదిరూపులై మఱియు పదునాలుగు లోకముల—T.
2. హృదయమందున్నట్టి యుర్వీశు పేర—T.
‡ దయ్యెన— అని ఉండవచ్చు.

బలియు దానవ వంశ — భంజనుండగుచు
చెలువందు కప్పర — చెన్నని పేర

[1]హరిదాసదాసాను — పరవినవుచు మించు
మరువన్నె జాతిని — మహిం వెలయువాఁడు

[2]సుమతి సోమయ్యకు - శుభగుణవతికి
భామ మల్లాంబకుఁ - బట్టియైనట్టి

ధర వెలయు బలభద్ర - దాసి శ్రీహరికి
పురణింపఁజెప్పె క - పోతవాక్యంబు

........................................

చరితంబు కప్పర - చెన్నని పేర

చెలఁగి రఘుపతి మున్నుఁ - జెప్పిన ఫలము
కలుగు నీ కథ విన్న - ఘను లందఱికిని.

బలభద్రదాసి విరచిత
కపోతవాక్యము సంపూర్ణము

---

1. హరిదాసుఁడనఁగ మది మించి —T.
2. సోమయ సోముకు శుభ గుణాన్వితయైన —T.

# ముఖ్యపద సూచి

—: ౦ :—